శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# [illegible] జ్యోతిశ్శాస్త్రము

## తృతీయ తరంగము – ముహూర్తభాగము




రచయిత :

వంశపరంపరానుభవవైద్య, జ్యోతిషరత్న, వాస్తు స్వయంభువు

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

**వేంకట వరదాచార్యులు**

బొందలదిన్నె (పోష్టు) తాడిపత్రి తాలూకా.

తాడిపత్రి బ్రాంచి అనంతపురం జిల్లా.



**1982**

ప్రథమ ముద్రణ: 300 ప్రతులు.




(వెల; రు. **7-50**


శ్రీ రంగరామానుజ ప్రెస్ - తాడిపత్రి.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# విజ్ఞప్తి

జ్యోతిశ్శాస్త్ర మహాశయులారా కాలామృతము ముహూర్త దర్పణము సర్వముహూర్తములకేగాక అనేక విషయములకు సహాయంతు వులుగా నిలచియున్నవి. వీరు నిర్ణయించిన ముహూర్తస్థానముల పరికించిన జ్యోతిశ్శాస్త్రమునకు అడ్డముగా విరుద్ధముగ నిలుచుచున్నవి. ఉదాహరణ- వివాహ ముహూర్తమునకు సప్తమములో ఏగ్రహముండ కూడదన్నారు. అది కళత్రస్థానముగదా. ఏ గ్రహములేని చోటులో యే ఫలముండునని పరిశీలించిన నిర్వీర్యమై అప్రయోజకమై అధోగతిగా నుండునని గన్పడుచున్నది. అట్టి జాతకునకు సంసారమొక నరకముగా నుండును. కోపిష్టి రోగిష్టిగాను, శోకగ్రస్త, దూరగ్రస్త, నేరగ్రస్త, గాను కళత్రము దాపురించి మైథున నిద్రాహారస్థానము సప్తమముగాన వల్లకాడుగా మార్చును- సప్తమములో లగ్న పంచమ భాగ్యస్థానాధిపతులలో నొకరుండిన వానిసంసారము సుఖసంతోషములతో మైథున నిద్రాహారములు సకాలమునకు లభించుచున్నవి. లగ్నపంచమ భాగ్యస్థానాధిపతు లెచ్చట నుందురో ఆ యింటిఫలము సంతోషముగా నుండును. ఇది అనుభవ సిద్ధాంతము- వివాహ గర్భాదాన అన్నప్రాశనము మొదలుకొని ద్వాదశలగ్నములలో లగ్నము నుండి ఎచ్చట నుండవలయునో పూర్తిగ గమనించక గురు శుక్ర బుధచంద్రులు శుభులనియు, రవి కుజ శని రాహుకేతువులు నైసర్గికపాపులనియు భావించి సిద్ధాంతము చేసుకొనుటవల్ల జ్యోతిశ్శాస్త్రము సంపూర్ణముగా నశింపైనది. శాస్త్రము ఋషులవాక్కుగాదని నిశ్చయముగా తెలియుచున్నది. యే ముహూర్తనకు యే స్థానముండవలయునన్నదిలేదు. తిథి వార నక్షత్రములతో ఆట్లాడినారు. గ్రహములు స్థానములు గమనించలేదు.

గ్రహముల నుండి యే సర్వజీవులకు సుఖదుఃఖములు గలుగుచున్నవని తెలియలేదు. తిధివార నక్షత్రముల నుండి సుఖదుఃఖములు చావు బ్రతుకులు గలుగుచున్నవని గ్రహించినారు. గ్రహములు సంచరించు కాలము తెలుసుకొనుటకు పుట్టినవని గ్రహించలేదు. ఉదా- ఉపనయనమునకు అష్టమశుద్ధియుండవలయునన్నారు- ఉపనయనము వేదాధ్యయనము చేయుటకు మంత్రోపాసన చేయుటకు ఉపాసనబలముతో అష్టశిద్ధి బొందుటకు అధికారమిచ్చుదినము- బృహస్పతులు తండ్రి మొదలగు పెద్దలు బ్రహ్మోపదేశము చేయుచున్నారు. పంచమ నవమ శుద్ధి వుండవలయును. పంచమము విద్య నవమము. దైవభక్తి శక్తి గాన పంచమ నవమములలో లగ్న పంచమ నవమాధిపతులుండునట్లు చూడవలయును. త్రికోణములందేగద పూర్వపుణ్యముండును. త్రికోణాధిపతులేగద రక్షణీయులు. కోణములు, కేంద్రములు తెలుసుకున్నారేగాని వీటియందేమి గలుగుచున్నవని పాపపుణ్యస్థానము లెవ్వియని పూర్తి తెలియరైరి- అష్టమశుద్ధియందుకని అడిగినవారులేరు. గృహవాస్తు, జలవాస్తు, గ్రామవాస్తు, దేవాలయవాస్తు, ప్రశ్నభాగము స్త్రీల జాతకము మొదలగునవి సర్వము జ్యోతిశ్శాస్త్రము చక్కగా తెలిసిన అన్ని చెప్పవచ్చును. గుణితశాస్త్రము మాత్రము ప్రత్యేకించి వుండవలసియున్నది. గుణితభాగములోకూడ (పంచాంగము) గ్రహమిత్రత్వము, జననమరణములు, వివాహ, ఉపనయనములు మొదలగునవి వీరినే అనుసరించి వ్రాయుచున్నారు. వీరు వ్రాసినవి పండితులందరు అనుసరించుచున్నారు. పరిశీలించిన వారులేరు- ఏ ముహూర్తమునకు ఏ భావము చూడవలయునో ఏ గ్రహముల నందునిలుపవలయునో గమనించి ముహూర్తముల నియమించలేదు. తప్పొ వప్పొఅని విమర్శించిన వారులేరు- పెద్దవారు యేర్పరచిన శుభగ్రహ పాపగ్రహ విభజనయే యిందుకు కారణము- ఈ శాస్త్రమునకు ప్రాణవాయువైన

ప్రాథమిక విద్యావిధానము లేకపోవుట– గురు శుక్ర బుధ చంద్రగ్రహములు ప్రతిలగ్నమునకు శుభులనుట ఇది నామతము ఇది నామతమని నానావిధముల శాస్త్రముల సృష్టించుట దృక్కుకు వచ్చునా లేదా అని గమనించకపోవుట ఇట్టి విపరీతములతో శాస్త్రము దెబ్బతిన్నదని తెలియుచున్నది.

దైవజ్ఞుడనుపేరు నిలుపుకొనవలయుననిన ప్రతి లగ్నమునకు లగ్న పంచమ నవమాధిపతులే శుభులని తెలుసుకొనుట మంచిది- ద్వాదశలగ్నములలో గురుపాలిత శనిపాలితముల గమనించుకొనుట స్థానకారకత్వముల పూర్తి తెలుసుకొనుట– ఏ ముహూర్తమునకే స్థానములో శుభగ్రహముండవలయునో గమనించుట ముఖ్యము. గమనించిన ఆరిపోయిన జ్యోతి మరీ వెలుగు నిచ్చును. తప్పదు.

ఇట్లు
గ్రంథకర్త.



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# విషయసూచిక

పేజీ.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# శ్రీ రాఘవేంద్ర గురు ప్రార్థన.

తే॥ రాఘవేంద్ర గురూత్తమ రాగరహిత
నిన్ను కనుదోయిగానెంచి యున్నవాడ
దారియెటుచూపెదో నీదెభారమయ్య
అవ్యయానందయతిరాజ దివ్యతేజ
కర్మభూమిది కన్నులుగల్గి గ్రుడ్డి
చేయిసాచితి సద్గతి చేర్చుమంచు
చేర్తువో చేర్చవో శరణార్థునయితి
రమ్యగుణసాంద్ర మద్గురు రాఘవేంద్ర
కర్మచీకటులలమిన కారణమున
కన్నులుండియు దారిని గానకుంటి
వెలుగు చూపించి చేర్చుమావలను నన్ను
పరమ గుణగణ్య సన్మాన్య గురువరేణ్య.

కం॥ శనిపాలిత లగ్నములన
శనిబుధకవిగ్రహములనుచు శాసనమయ్యెన్
కనివినమని కడద్రోసిన
కనుగానని జోస్యమౌను కనుగొనువర్యా.

# శ్రీ రాఘవేంద్రస్వామి మంత్రాలయము



శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మ రతాయచ
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే.

కం॥ జ్యోతిష్యము కనుజగతిఁ
జ్యోతిష్యము ప్రకటించెఁ జ్యోతిర్మయుడా
జ్యోతిష్యము చెడినను ఖ
ద్యోతుండదుగంటినట్లుదోచును వత్సా.

కం॥ యోగంబులు పూర్వులనుడి
యోగంబులుగావు మిగులయోచించిగనన్
యోగంబులనగ నానుడి
యోగంబులె యోగములను యోగాఢ్యుడే.

కం॥ గురుకుజరవి శశిగ్రహములు
గురుపాలితలగ్నములుగ గురుతిడితిని నే
నెరుగమె శాస్త్రములందని
గురుతును ఖండింపజ్యోతి కూడ్చునువత్సా.



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# యాచించకనే దానము (గుప్త దానము)

సప్రమాణ జ్యోతిస్సారములో ముహూర్త భాగము తృతీయ తరంగము ముద్రణ చేసినారా? అని ఒక మిత్రుడు అడుగగా, ముద్రణ చేయుటకు ధనలోపమున్నదని నేను చెప్పుచుండ విని ఆరు వందల డబ్బుయిచ్చి ముద్రితమునకు చేయూత నొసంగిన ధర్మహృదయుడు-

శ్రీ శ్రీ శ్రీ మంచికంటి వెంకటరంగయ్య శ్రేష్ఠిగారి ధర్మపత్ని చి॥ సౌ॥ కుం॥ సుబ్బలక్షమ్మ గారి పుత్రుడు

**చిరంజీవి క్రిష్ణరంగయ్య శ్రేష్ఠి గారు.**

వీరిని భగవానుడు నిరంతరము కాపాడుగాత. ఆదిత్య నవగ్రహానుగ్రహసిద్ధి యెల్లప్పుడు గలుగుగాత. కళత్ర పుత్ర, పుత్రిక పౌత్రులతో వంశాభివృద్ధియై ఆయురారోగ్యభాగ్యములతో వర్ధిల్లుగాత. సరస్వతీ అనుగ్రహముతో పుత్ర, పౌత్రులు వర్ధిల్లుదురుగాత.

ఇట్లు గ్రంథకర్త మంగళాశీస్సులు.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# పండితాభిప్రాయములు.

కళాప్రపూర్ణ
డాక్టర్ దాశరథి, డి. లిట్.
ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి

ఫోన్, 38147
104-(సి. బ్లాక్)
మాతృశ్రీ మందిరం
హైదర్ గూడా,
హైదరాబాదు-500 001.

26-1-82
గణతంత్ర దినోత్సవము.

## ముహూర్త మహిమ.

మనదేశము అతిప్రాచీన కాలముననే జ్యోతిశ్శాస్త్రమున ప్రపంచమునకు దారిచూపినది. విదేశీయుల పరిపాలన కాలమున మన ప్రాచీన విద్యలకు తగినంత ప్రోత్సాహము లేకపోయినది. విద్వాంసులు స్వయంకృషితో వైద్య, జ్యోతిష, వాస్తు శాస్త్రములను సజీవముగా నుంచిరి.

శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వేంకట వరదాచార్యుల వారు వంశ పరంపరానుభవ వైద్య, జ్యోతిష, వాస్తు విద్యా విశారదులై అపారమైన కృషి చేస్తున్నారు.

“సప్రమాణ జ్యోతిస్సారము” అను మహాగ్రంథమును రచించినారు. ఇది తృతీయ తరంగము ముహూర్త భాగము.

వీరి పరిశోధనకు తగిన సౌకర్యములున్నయెడల ఈ విద్వాంసులు మన ప్రాచీన శాస్త్రాధ్యయనమున మరింత కృషిచేసే అవకాశం ఉంటుంది. సరియగు ముహూర్తనిర్ణయము గొప్ప మేధాసంపత్తితో చేయవలసిన పని. ముహూర్తమాత్రమున, మంచి, చెడుగా, చెడు, మంచిగా మారవచ్చును. కనుక ముహూర్తము విలువ గణనీయము.

శ్రీమాన్ వరదాచార్యుల వారి కృషి ప్రశంసనీయము. ఈ గ్రంథము విద్వజ్జనామోదమును, బహుళజనామోదమును పొందగలదని విశ్వసిస్తున్నాను.

దాశరధి.

---


డాక్టర్ సి. వి. సుబ్బన్న శతావధాని
ఎం. ఏ., పి. హెచ్. డి.,
ప్రొద్దుటూరు - 516 360.


అభినందనము.

శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వేంకట వరదాచార్యుల వారి "సప్రమాణ జ్యోతిస్సార" సాగరమున నిది తృతీయ తరంగము. ఇందు తార్త్తియీక పురుషార్థసంబంధి విషయచర్చ సమగ్రముగ సమకూర్చబడినది.

కార్తాంతిక హిరణ్యాక్షులు జ్యోతిశ్శాస్త్ర ప్రపంచమును చాపచుట్టినట్లు చుట్టి, సందేహబహుళ పాతాళగర్తమున ద్రోసిరి. దానినుద్ధరించుటకు సంశయాంధకార నిరాకరిష్ణు శాస్త్రదంష్ట్రాతీక్ష్ణరోచిఃప్రకాశుడగు యజ్ఞవరాహస్వామి యవతరింపవలెను.

తదవతారమే శ్రీ వరదాచార్యుల వారు

హిరణ్య మనగా కాంచనము. దానియందే దృష్టి కలవాడు హిరణ్యాక్షుడు. కాలామృత ముహూర్తదర్పణాది గ్రంథము లట్టివారిచే క్రోడీకరింపబడినవి. పురోహితులు గొర్రెదాటుగా వాని ననుసరించి నడచుట జరుగుచున్నది. ఇదెంత వెర్రితనమో ఆచార్యులవారు కుండ పగులగొట్టినట్లు వివరించినారు.

ఆచార్యులవారిది కుతర్కము కాదు.

ఏ జాతకము చేతికిచ్చినను, పరిశీలించి, ప్రమాణీకరించి, చెప్పి యొప్పింతురు. దానిని కాదనుటకు వీలు లేదు.

చిరకాలార్జితమైన తమ అనుభవపరమార్థము గ్రంథస్థము చేసి, లోకమున కర్పించుచున్న వీరి ఉదార హృదయమునకు అభివాదము లర్పించుచున్నాను.

సుధీవిధేయుడు,
సి. వి. సుబ్బన్న శతావధాని.
28-1-82

## -: అభినందనము :-

కళాప్రపూర్ణ
**డా. దివాకర్ల వేంకటావధాని** ఎం. ఏ , (ఆనర్స్) పి. హెచ్. డి ,

శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వేంకట వరదాచార్యుల వారు నాకు చిరపరిచితులు. వారు కవులు. వైద్య జ్యోతిర్వాస్తుశాస్త్రము లందు బహునిష్ణాతులు. వారి సప్రమాణ జ్యోతిస్సారము నందలి మూడవ తరంగము చదివి ఎన్నో నూతన విషయములు తెలిసికొంటిని. ఈ తరంగము ముహూర్తభాగమునకు సంబంధించినది. భారతీయు లేకార్యము తలపెట్టినను మంచి ముహూర్తము నన్వేషింతురు. శుభ ముహూర్తమున నారంభింపబడిన కార్యములు శుభకరముగను నిర్వి ఘ్నముగను కొనసాగిపోవునని వారి విశ్వాసము. కాని గొప్ప గొప్ప శాస్త్రవేత్తలు పెట్టిన ముహూర్తములందు జరిగిన కార్యములే కొన్ని అశుభకరములు లగును. విఘ్న విహతములునై సంతాపావహములగు చున్నవి. కారణమేమి? ఋషిప్రోక్తమైన శాస్త్రమెప్పుడును దుష్టము

కానేరదు. కాని యందలి విషయములను వివరించువారి అజ్ఞతచేతను, అహంభావముచేతను, సర్వజ్ఞమన్యతచేతను చేటు వాటిల్లుచున్నది. పండితులయందుకూడ కొన్ని మూఢ విశ్వాసములు చిరరూఢములై పోయినవి. సమ్యక్పరిశీలనా భావమే అందుకు కారణము.

నాకు జ్యోతిషమునందుకాని అందుకు సంబంధించిన ఏ భాగము నందుకాని పరిచయములేదు. కొంత శ్రుతపాండిత్యము మాత్రమున్నది. శ్రీమాన్ వరదాచార్యులవారిగ్రంథమునకు మొదట వ్రాసిన విజ్ఞప్తిని గ్రంథము నందలి కొన్ని భాగములను పఠింపగా ముహూర్తముల విషయమున లోకమెంత తప్పుత్రోవను పోవుచున్నదో తెలియవచ్చినది. గ్రంథము నందలి విషయములుకొన్ని చిరకాలానుస్యూతములైన సంప్ర దాయములకు విరుద్ధములుగను ప్రత్యాఖ్యానపూర్వకములుగను కాన వచ్చుటచే విప్లవాత్మకములుగా గోచరించును. కాని శ్రీమాన్ ఆచార్యుల వారు చెప్పిన హేతువులను పరిశీలించిన పిమ్మట నవి యెంత సత్య సమ్మతములో స్పష్టముగా విశదమగును.

శ్రీమాన్ ఆచార్యులవారు గురుశిష్య సంవాద రూపమున వెల యించిరి. శిష్యుడు లోక సంప్రదాయము ననుసరించి తనకుగల సందే హములు తెలుప గురువుగారు సప్రమాణముగా వానికుత్తరములు తెల్పి సందేహనివృత్తి కావింతురు. ఆ శిష్యుడు జనులందఱికిని ప్రతి నిధి. వారందఱికిని తోచు సందేహములనే అతడు వ్యక్తము చేయును. గురువుగారు గ్రంథకర్తలే! వారు వానికన్నిటికిని శాస్త్రోక్తిపూర్వకముగను సామాన్య పరిజ్ఞాన పూర్వకముగను సమాధానములు చెప్పుదురు. అవి చదివిన తరువాత అందలి హేతువాదపూర్వకమైన ఔచిత్యము నంగీ కరింపక తప్పదు.

సుముహూర్తము అందరికిని కావలయును. ఏ ముహూర్తమునకే దావము చూడవలయునో, గ్రహము లెచ్చటెచ్చట నెట్లుండవలయునో చక్కగా పరిశీలింపవలసియున్నది. కాని శాస్త్రమునకు ప్రాణభూతమైన ప్రాథమిక పరిజ్ఞానము ముహూర్తములుపెట్టు పండితులకే సరిగా లేక పోవుట శోచనీయము. చూడవలసినది గ్రహబలముకాని స్వీయమతము కాదు. తమ తమ మతములనే సర్వశ్రేష్ఠములుగా కొందరు పరిగణించుట వలన లోకమున సజ్జనులగు జనులకెంతో హాని చేకూరుచున్నది. ప్రతి లగ్నమునకును లగ్న పంచమ నవమాధిపతులే శుభులని తెలిసికొనవలయుననియు, నేను హూర్తమున కేస్థానములో శుభగ్రహము లుండవలయునో తెలిసికొనుట ముఖ్యమనియు శ్రీమాన్ ఆచార్యుల వారు చెప్పుచున్నారు. ఇందుకీశాస్త్ర విషయము సరిగా తెలియని నాకంటె విజ్ఞులే అధిక ప్రమాణము.

వివాహము, గర్భాదానము, విద్యాభ్యాసము, ఆయుష్కర్మ, ప్రయాణము, గర్భవతులు ప్రసవమునకు పోవుట, నూతన వధువు భర్తృగృహమున కరుదెంచుట, మరణ సమయముల గృహమును విడుచుట, గ్రహణ సంబంధమైన కీడు మున్నగు విషయములందు ముహూర్తములు పెట్టు సందర్భమున శ్రీమాన్ ఆచార్యులవారు చెప్పిన విషయములు తప్పక గమనింపవలసియున్నది. వివాహసందర్భముల కుజదోష భయము బహుళ వ్యాప్తియందున్నది. ఒక్క ఆ కారణము చేతనే కుదురక చెడిపోయిన సంబంధములెన్నో యున్నవి. నిజమున కన్నిగ్రహములును కొన్ని సందర్భములందు శుభకరములును, కొన్ని సందర్భము లందశుభకరములును అగును. ఆ విషయము ముహూర్తము పెట్టువారు లెస్సగా పరిశీలింపవలయును. ఆచార్యుల వారు చెప్పిన యొక విషయము నాకు చాల నచ్చినది. అది నవగ్రహ

జపవిషయము పాపులకు పుష్టి కలిగించుట పామునకు పాలుపోయునట్లే హానికి కారణమగును. అవసరమునుబట్టి యెవరికి పుష్టి కలిగింప వలయునో వారికి పుష్టి కలిగింపవలయును. లేనిచో గ్రహములలో గ్రహములకు పోరు పెట్టినట్లగును. చేసిన ప్రయత్నము వలన లాభముండదు.

శ్రీమాన్ ఆచార్యులవారి భాషసరళము సుబోధమునై యున్నది. కొన్నిచోట్ల వారు గట్టిగా మందలించుట మనమేలుకొఱకే, వారిగ్రంథము సామాన్యులకే కాక పండితులకును పఠనీయమై విశ్వశ్రేయోహేతువై విలసిల్లుచున్నది. గ్రంథము బహుపరిశోధనతోకూడి సప్రమానమై సర్వశ్రేయస్కరముగా నున్నది. వారి పరిశీలన పాటవమునకు నా అభివందనము లు.

దివాకర్ల వేంకటావధాని.



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

శ్రీ శారదా దేవతాభ్యోనమః  శ్రీ లక్ష్మీ నృసింహాయనమః

# సప్రమాణ జ్యోతిస్సారము.

## తృతీయ - తరంగము

## ముహూర్త భాగము - వివాహము.



శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీ స్తత్సుతాన్ గురూన్.
సత్వా సమస్త ప్రత్యూహశాంతయే మంగళాయచ.

శ్రీవత్సుడు - స్వామి - కళత్ర భావము సప్తమమన్నారు దానినే సప్తమ మారక స్థానమని చెప్పుచున్నారు. ఆ సప్తమమున ఎట్టి గ్రహములున్న సత్కళత్రము లభించును ఏ గ్రహములున్న కోప గ్రస్త, రోగగ్రస్త, శోకగ్రస్త, నేరగ్రస్త, దూరగ్రస్త వచ్చును. అన్న విషయములు ఎవ్వరు చెప్పలేదు, అడిగినవారులేరు ఇందులో ఎట్టివారు ఏ స్థానాధిపతులు సప్తమములోనుండిన ఏవిధముగా జరుగునో తెలుపుదు.

గు:— వత్సా సప్తమములో శుభగ్రహము లుండవలయును. అట్లుండుటకు పూర్వజన్మ సుకృతముండవలయును. ఇది అందరికి లభించదు త్రిదేవి ధ్యానముచేయుచు కట్టుకున్న భార్యను, తల్లిని అక్కచెల్లెండ్ర కంటికి రెప్పవలె చూచిన వారికి కోణాధిపతులగు లగ్న పంచమ, నవమ స్థానాధిపతులలో నొకరు సప్తమములో నుందురు - నుండిన అనురాగవతి వినయ విధేయతలుగల సతి సౌందర్య సౌకుమార్య సౌభాగ్య సౌశీల్యవతి ఇల్లాలుగావచ్చి పురుషుని సంతోష

పరచును. తన సంతతిని బాగుపరచుకొనును, బంధు మిత్రులలో వన్నె గడించును. భర్తకు యే అనుమానమునకు చోటివ్వక అన్యోన్యముగా ప్రవర్తించుకొనును. భర్త కోపించినను చిరు నవ్వుతో ప్రత్యుత్తర మిచ్చుచుండును - లగ్న పంచమ నవమాధిపతులు సప్తమ స్థానమును మొదటి పాదము నుండి సంపూర్ణముగా నాక్రమించియుండిన సకల సద్గుణవతిగా నుండును. తొమ్మిది పాదములలో ఏడవ పాదము దాట కుండిన సద్గుణవతిగా నుండును ఏడవ పాదము దాటిన బలహీనముగా నుండును.

కం॥ తను స్థానాధిపు లేడిట
ఘనముగ కూర్చున్న యడల కలుగు సుఖంబుల్
జననుతమగు సంసారము
వనితామణి వలచివచ్చి వాలును వత్సా.

కం॥ త్రిదశులవలె వెలు గొందుచు
బుధజననుతమౌచు వెలయు పుణ్యాంగనతో
వదలని అన్యోన్యముతో
మదను విలాసములతోడ మనుదురు వత్సా.

అన్యోన్య దంపతులై అరువది సంవత్సరములుదాటి షష్టిపూర్తి చేసుకొందురు. యౌవనవంతులై కామ సుఖమనుభవింతురు కామము నకు నెలవు సప్తమము సతీపతుల అన్యోన్యమునకు ఆనందమునకు ఎడ బాయని ప్రేమకు సకాల వివాహమునకు సప్తమమే స్థానము.

కం॥ ఆహార విహారంబులు
బాహా టోపముగ నడుచు బహు ముఖములతో
దేహారోగ్యము గలుగును
సాహసు లేడింట నుండ సత్యము వత్సా.

సాహాసులు నవ గ్రిహములలో లగ్న పంచమ నవమాధిపతులు వీరు ఏడింట నుండిన సకాల భోజనము సకాల నిద్రి సకాల విహారము సకాల వివాహము సకాల ప్రియాణముగలిగి సుఖింతురు దేహారోగ్యము గలుగును ఆయుర్దాయము గలుగును. ఆనందముగా కాలము నడుచును.

కం॥ పాలకు లేడిట నుండిన
పాలన లాలనయుగలిగి ప్రిభుడై వెలుగున్
పాలకు లేడిట నుండని
కాలము వ్యర్ధముగ నడుచు కనుగొన వత్సా.

పాలించు లాలించు గ్రిహము ప్రితి లగ్నమునకు లగ్నపంచమ నవమాధిపతులు వీరిలోనొకరు సప్తమమున నుండిన పాలన లాలన గలుగును అనగా మైధున నిద్రా, ఆహారములకు లోటు ఏనాడుగలుగదు సప్తమమున సున్న శుభ గ్రిహదశ పోయిన అర్దము తగ్గును ఆగ్రిహ దశ పోకుండిన జీవితాంతము మైధున నిద్రా ఆహారములనుభవింతురు కాలము సౌఖ్యప్రిదముగా నడుచును.

కం॥ ఇల్లరికం బేడింటను
తల్లులు నొకరైన నుండ తప్పక వచ్చున్
నొల్లలయని సుఖములతో
తల్లుల కృపతోడ బ్రితుకు తథ్యము వత్సా.

వత్సా తల్లులనగా లగ్నమునకు పార్వతియు, పంచమమునకు సరస్వతియు, నవమమునకు లక్ష్మియు అధిపతులు వీరు సప్తమములో నుండిన సకల సౌఖ్యములు వీరి అనుగ్రిహతో లభించును. ఆయురారోగ్య భాగ్యములు మూడు చేకూరును.

కం॥ ఇహ సుఖములు సప్తమమే
ఇహమున శుభు లున్నయడల నిహ పరములలో
మహదానందము తనదై
మహారాజువలెన్ వెలుఁగు మహిలో వత్సా.

ఇహ సంబంధములైన సుఖములు సప్తమముననే యుండుట గలదు నవమాధిపతి యుండిన ఇహ పరములలో సుఖింపచేయును సత్కళత్రమును చేకూర్చి ఇహ సౌఖ్యములు కొంత లేకుండచేయును, బలవంతముతో దైవప్రార్థన చేయించుచు దాన ధర్మములు నీతి నియమములు నేర్పి పుణ్య లోకమునుచేర్చును. పూజా పునస్కారములకు కావలసిన వస్తువులచేకూర్చి పూజా సమయము వ్యర్థముగాకుండ గాపాడును. భర్తను ఆనంద పరవశునిచేసి ఆనందాబ్ధి తరంగములలో నుయ్యలలూపును, సప్తమమున నవమాధిపతి యుండు జాతకులరుదు ముందు జన్మమున లక్ష్మీదేవిని మనోవాక్కాయ కర్మల గొలచినవారికే అష్టైశ్వర్య సన్నిహితమై సకల సద్గుణ వతియగు భార్యలభించును.

కం॥ ఏడే నిహ సుఖములకున్
నేడే సుఖ దుఃఖములకు నేడే నెలవౌ
నేడే విందుల భుక్తము
నేడిట శుభులున్నవాని కేర్పడు వత్సా.

ఏడు సృష్టికి మూలము సృష్టి మూలములు ఆకలి నిద్ర కామములు వీటిలో యేది తక్కువైనను దుఃఖమునకు దారి చూపును సప్తమములో పాపులున్న సంసారము హింసా కరముగా నుండును. శుభులున్న యడల వివాహ భోజనములు, విందులు వినోదములు లభించుచుండును. పాపులున్న దుఃఖజీవితమగును, ఏవీలభించవు. పాపులున్న దుఃఖము పుణ్యులున్న సుఖము గలుగును.

కం॥ నవమాధిపుడేడింటను
జవసత్వము తోడనుండ జవరాలు యటున్
జవదాటని గుణవతియై
పరివిమలయశ సంపదలతో వచ్చును వత్సా.

కం॥ తల్లులు ముప్వురు నేడిట
చల్లగ కూర్చున్న యడల సర్వసుఖంబుల్
కొల్లగవచ్చును యదురై
నుల్లాసము నుయ్యలేసి నూపును వత్సా.

నవమాధిపతి సప్తమమున నుండుటవల్ల సర్వసుఖములు చేకూరును గురులగ్నములకు లగ్నపంచమ నవమాధిపతులు శుక్రుని చూచినను ఒకే రాశిలో శుభునికి శుక్రుడు ముందుండినను వివాహాదులకు కష్టముండదు. మహా రూపవతి భార్యలభించును. ముప్వురిలో నొకరు సప్తమమున నుండిన ఇహసౌఖ్యముల్లెల్ల వారివేననవచ్చును.

కం॥ పంచమనాయకు డేడిట
నంచితముగ నుండెనేని నాలుమగళ్ళున్
వంచనలేక సుఖింతురు
సంచిత కర్మముల నెరిగి సఖులై వత్సా.

కం॥ చదువుల రాణి సత్కారుణ
చదువులలో చతురయయ్యు సద్గుణవతియై
సుదలాలి కెడి పలుకులతో
మదవతి వెతుకకనె, వచ్చు మహిలో వత్సా

పంచమస్థానాధిపతి సప్తమములో నుండిన సంసారము. అనేక విధముల ముందుకు తెచ్చును. భర్తకు పలువిధముల ధర్మముల తెలుపుచు గృహము, గృహోపకరణములు చక్కగా సరిదిద్దును.

వీధిలో కీర్తి గడించును. పిల్లల మంచిమార్గమున త్రిప్పును. భర్తకు అనురాగవతిగా నుండును. గ్రంధశోధనచేసి పలువురకు నీతి నియమముల బోధించు చుండును. అందరిలో తలలో నాలుకగా సంచరించును. సద్గుణవతియని అందరు పలువిధముల పొగడునట్లు చేసుకొనును. లగ్న పంచమ, నవమ స్థానాధిపతులు సప్తమములో నుండువారు ముందు జన్మమున లక్ష్మి, సరస్వతి, పార్వతుల ధ్యానించి పూజించినవారుగా నుందురు. ఈ మువ్వురిని ధ్యానింపక, ఇల్లాలి కష్టముల లెక్కింపక, ప్రీతిగా చూడక కష్టములపాలుచేసి మరొక స్త్రీని ప్రేమించిన పాపము సప్తమమున చేరియుండును. 6, 3, 8, 12 గృహములవారుచేరి పురుషుని దుఃఖమున దింతురు. మనోవ్యథను గల్పింతురు. ఒక జన్మమంతయు దుఃఖసాగరమున ముంచిడ్తురు. ఇది నిశ్చయము.

కం॥ నుండిన నేడిట పాపులు
ఖండితముగ స్త్రీసుఖంబు కరువై పోవున్
పండును పాపము మెండై
దండుగ మగవాని బ్రతుకు తలపగ వత్సా

సప్తమమున పాపులనగా 3, 6, 8, 12 స్థానాధిపతులుండిన స్త్రీ రోగగ్రస్తగానో, కోపగ్రస్తగానో నుండును పురుషుని సుఖపెట్టలేదు. పురుషునికి ఉష్ణవీర్యమై శీఘ్ర స్ఖలనమైపోవుటవల్ల సుఖము లేకపోయెనని చింతించుట తప్పదు. ఇల్లాలి ప్రేమ నశించును. అన్యోన్యత పటాపంచలైపోయి దండుగ జీవితములగును.

కం॥ పాపులు సప్తమమందున
దాపురమై నుండిరేని దార నశించున్
కోపము తాపము రోగము
మోపయి దుఃఖాబ్ధియందు ముంచును వత్సా.

సప్తమమున అష్టమ, ద్వాదశస్థానాధిపతు లుండిరేని వారి దశా భుక్తులలో దార నశించును. శుక్రుడు సశుభుడైయుండిన ద్వికళత్రము సంప్రాప్తించును. లేదా స్త్రీ సుఖము జీవితాంతములేక నశింపవలసి వచ్చును. వ్యభిచారముచేసి పాపభూయిష్టుడు గావలసి యుండును. మదనతాపముతో కృశించవలసివచ్చును.

కం॥ పరధన పరాన్న భుక్తము
పరదారా పరగృహంబు ప్రాప్తించు సదా
స్థిరముగ సప్తమ మందున
తరుగని పాపిష్టులున్న తథ్యము వత్సా

కం॥ సప్తమరాశి నాయకుడు
సప్తమ మందుండెనేని సర్వసుఖంబుల్
తప్తంబై వ్యర్థంబై
లుప్తముగానైన లేక కుములును వత్సా.

పరధనము పరాన్నము - పరదారల నాశ్రయింప చేయును. పరపంచల పరుండబెట్టును. పాపాలోచన జేయించును. సప్తమ భావమునందు పాపులుండిన సప్తమాధిపతి సప్తమములో నుండిన ప్రపంచాశయములన్నీ వ్యర్థమై తపింపజేయును. సారములేని సంసార మగును. దీనిని భావాత్ భావ ఫలప్రద అన్నారు. జ్యోతిష గ్రంథ కర్తలు దుష్ఫలమేనని సత్‌ఫలముగాదని ఎరుగరైరి. లగ్న సప్తమ ములో శుభులు లేకున్న రుద్రప్రదేశమగునని తెలియరైరి. సప్తమ మున శుభులు లేకున్న కణ కణలాడే నిప్పుల గుండమని యరుగరైరి. వివాహ లగ్నములకు సప్తమములో లగ్న పంచమ నవమాధిపతు లుండవలయునను మాట మరచిరి. సప్తమమున ఏ గ్రహముండ కూడదని శాసించిరి ఇదియెట్లో గ్రంథకర్తకే తెలియును. సప్తమమున

పాపులున్నవారి సంసార మా బ్రహ్మకే యెరుక. ఒక జన్మమంతయు తలదిమ్మ పట్టును.

కం॥ ఆరింటివాడు నేడిట
దీరుండై యుండెనేని తీరని వ్యాధుల్
దారకొ తనకో వచ్చును
మారునిపని మట్టిగలియు మహిలో వత్సా.

ఆరవ యిల్లు శత్రురోగ ఋణవిపత్తుల సృజించునది. ఆ యింటి వాడెచ్చటుండినను శతృరోగ ఋణవిపత్తుల గలిగించుటే వాని పని. అట్టి వాడు ఏడింట కళత్ర స్థానములో నుండిన కళత్రము, కోపిష్టి, పాపిష్టిగానో, నేరగ్రస్త, దూరగ్రస్త, రోగగ్రస్తగానో నుండచేయును. లేదా తనకు రోగము, ఋణము, శత్రువు, పరాభవము విపత్తులు, ప్రమాదములు గలిగించును. సురత సుఖము సున్న చేయును. అన్యోన్యము నశింపచేయును. సంసారము బరువై పోవును.

కం॥ అష్టమ నాధుండేడిట
స్పష్టంబుగ నుండ సుదతి సమయుట నిజమౌ
కష్టము నష్టము తప్పదు
స్రష్టయు తీర్చంగలేడు సత్యము వత్సా.

అష్టమ స్థానాధిపతి సప్తమములో నుండిన ద్వికళత్రయోగము తప్పదు, అష్ట కష్టములకు దారి తీయును. సంసారము అనేక విధ ముల మార్చును. ఒంటరిగాచేసి వంట చేయించును, నీళ్ల మోయించును, స్త్రీ సుఖము సున్నచేసి స్త్రీలతో పరాభవము చేయించును, అష్ట దారిద్ర్యములకు త్రోవ చూపును. దాసీలతో సంబంధము గల్పించి పరాభవము గల్పించును. మనస్సెప్పుడు స్త్రీ చింతనలోనె దింపును, నేరగ్రస్తుని చేయును. అపవాదుల గల్పించును. అధమాయుర్దాయునిగా

మార్చును. వీర్య నష్టము గల్పించి స్త్రీలతో పరాభవింప చేయును. కులస్త్రీ నేరగ్రస్తయని సందేహము గల్పించి శోకింప చేయును. సంసారమొక నరకముగా మార్చును.

కం॥ ద్వాదశనాథుండేడిట
పాదిగ కూర్చున్నయెడల భార్య నశించున్
వ్యాధులు నెదురగు నెప్పుడు
మోదము ఖేదముగమార్చు భువిలో వత్సా.

ద్వాదశస్థానాధిపతి సప్తమములో నుండిన భార్య వ్యాధిగ్రస్త యగుటో నమయుటయో తప్పదు. ఎక్కువ ఖర్చుచేయుచు సంసారము క్షీణింపచేయును. గృహచ్ఛిద్రముల గల్పించి దుఃఖపరచును, తృతీయాధిపతి సప్తమమున నుండిన వరుసగాని స్త్రీ దాపురించును. వయస్సెక్కువగల స్త్రీలతో సురత సుఖమనుభవింపచేసి పాపము వడిగట్టును సోదర సోదరీలవల్ల బాధ గల్పించును వివాహమునకు ఆటంకములు గల్పించు చుందురు. 3, 6, 8, 12 గృహములవారు 7, 8 గృహము లందుండిన వివాహమగుట ఒక కష్టము. అయినతోడనే వారితో ఒక కష్టము. సంసారమొక నరకము. ఈగ్రహబలము తెలియక పూర్వులు వచించిన శుక్ర, గురు, పూర్ణచంద్ర శుద్ధ బుధులు శుభులన్న మాటల నమ్మి వివాహాది ముహూర్తములన్నిటను కాలామృతమును కంఠస్థము చేసిన జోస్యులు ప్రజలకు మార్గదర్శకులు గాకపోవుచున్నారు. కాలామృతము ముహూర్త దర్పణము మార్గదర్శకము జోస్యులకుగాక – జోస్యులు ప్రజలకు మార్గదర్శకులు గాకపోవుచున్నారు. శాస్త్రమే కృత్రిమమైన చెప్పెడివారేమగుదురు. ఫలము నిష్ఫలమయ్యెను. జోస్యము నిస్సారమయ్యెను.

కం॥ కాలామృత వచనంబులు
ఫాలాక్షుని వచనములుగ పలికెరి విబుధుల్
హాలాహలమై పోయెను
సాలూపూలా నశించి సత్యము వత్సా.

కం॥ కనగముహూర్తదర్పణము
వనజాసను వాక్కులంచు పలికెరి విబుధుల్
వనజాసను వాక్యంబులు
వినగ నసహ్యంబులయ్యె వినుమా వత్సా.

ప్రమాణ గ్రంథములు అప్రమాణములైనప్పుడు ఆగ్రంథములు చదివిన జోస్యుడు ప్రజలకు మార్గదర్శకుడెట్లు కాగలడు. గుణములని, కూటములని, తారాబలమని అనేకమయిన దారుల గల్పించి శాస్త్రమును గ్రహించువారికి విసుకగునట్లు చేసిరి. విమర్శకులకు లోకువైరి. ఒకరు బాగున్నదనిన మరొకరు బాగులేదనిరి. ఇది నా మతము, ఇది నా మతమనిరి. ఇది చూచి మనోదృఢంతు మాండవ్యమని మాండవ్యుడు వచించెను ఇది నా మతమనెను. పలువురు పలువిధముల చెప్పుటవల్ల ఎటుపోవుటకు విద్యార్థికి మార్గదర్శకముగాకపోయెను - లగ్న, పంచమ, నవమాధిపతులు, లగ్న ద్వితీయమునగాని, సప్తమాష్టమములయందు గాని వుండునట్లు చూచుటే వివాహ ముహూర్తముగాని పూర్వ గ్రంథ ములు గల్పించిన కృత్రిమ వలయముగాదు-గురుపాలితమని, శనిపాలిత మని రెండు భాగములుగా ద్వాదశలగ్నములు విభజింపబడినవి. వాటిలో వధూవరులు ఏ పాలితులో గమనింపవలయును గురుపాలిత లగ్నములు మీన, మేష, కటక, సింహ, వృశ్చిక. ధనుస్సులు. ఈ లగ్నజాతకులకు, ప్రశ్నలగ్నజాతకులకు ఈ లగ్నములందే ముహూర్త ముంచవలయును. శనిపాలిత లగ్నములు వృషభ, మిథున, కన్య,

తుల, మకర, కుంభములు గాన ఈ లగ్నజాతకులకుగాని, ప్రశ్న లగ్నజాతకులకుగాని ఈ లగ్నములందే ముహూర్త ముంచవలయును. ఈ రెండు భాగములు ఒకటి ఎప్పటికిగావు. వారిలో వీరు, వీరిలో వారు కలియరు. ఏ పాలిత లగ్నములకు ఆ పాలిత లగ్నములోనే లగ్నముంచవలయును. అటుగాక గురుపాలిత లగ్నములవారికి శని పాలిత లగ్నములలోన శనిపాలిత లగ్నములవారికి గురుపాలిత లగ్నములలో ముహూర్తములు పెట్టరాదు. అట్లు పెట్టిన అశుభములు తప్పక కలుగును. అశుభజాతకులకు అశుభ ముహూర్తకాలమే కుదురును. అశుభలగ్నమే జోస్యులు పెట్టుదురు. ఇది దైవ నిర్ణయము. ప్రాప్తానుసారముగా లగ్నము కన్యక లభించును

కం॥ సప్తమమే సంసారము
సప్తమమే సత్కళత్ర సంతోషంబున్
సప్తమమే మృష్టాన్నము
సప్తమమున్ చెడిన చెడును సర్వము వత్సా.

కం॥ అష్టమమున శుభులుండక
దుష్టులు సందుండిరేని తొలగును సుఖముల్
కష్టంబులు ప్రాప్తించును
భ్రష్టమగున్ స్త్రీ సుఖంబు పతనము వత్సా.

సప్తమము సంసారసుఖముగాబట్టి సప్తమములో నొక శుభ గ్రహముండవలయును. లేదా చూడవలయును. అట్ల లేకున్న వధూ వరులు సుఖింపజాలరు.

కం॥ లగ్నమునకు సప్తమమున్
లగ్నంబున కష్టమంబు లావునశించన్
లగ్నము లేక తపించును
భగ్నము నరుబ్రతుకు భువిని పలచన వత్సా.

ఆ॥ సప్తమాష్టములు చక్కగానుండిన
సౌఖ్యపడును నెపుడు సతులతోడ
సప్తమాష్టమములు చక్కగా లేకున్న
సుదతి సురత సుఖము సున్న వత్సా.

లగ్నమున ద్వితీయమున సప్తమాష్టముల శుభులు లేకున్న సంసారసుఖము మన్నగలియును. పలువిధకష్టములు సంప్రాప్తించును.

కం॥ ప్రేమ రథారోహణమున
కామిని అధరామృతాది కౌగిలి సుఖముల్
కామకళావైభవమును
భౌముడు లగ్నమున నుండబడయును వత్సా.

బాల్య, యౌవన, కౌమార, వృద్ధాప్య దశలలో కుజుడు యౌవనావస్థకు అధిపతి యగుటయు, లగ్నములో శుభుడైయుండిన సప్తమాష్టమ, చతుర్థముల బలము గలిగించును. పుష్టిబలము సంతృప్తిగా నిచ్చును. యువతీ యువకులకు సురత సుఖము పరమానందముగా నిచ్చును. పాపియైయుండిన సర్వసుఖముల నాశనము చేయును. గురుపాలితములకు బాల్యమున చంద్రుడు శుభుడైయుండిన బాల్యము చక్కగా నడచును, యౌవనమున కుజుడు శుభుడైయుండిన యౌవన కాలము బహుసుఖములతో నడచును. ఇహసుఖములకు కుజ, శుక్రులు బలవంతులు - కౌమారదశకు సూర్యుడధిపతి. సూర్యుడు శుభుడైయుండిన కౌమారదశ చక్కగా నడుచును. వృద్ధాప్యమునకు గురువు అధిపతి. గురువు శుభుడైయుండిన వృద్ధాప్యములో బహుసుఖముల సౌఖ్యము, బుద్ధిబలము నిచ్చును. కామసుఖము గల్పించును. స్త్రీలకు బాల్యమున చంద్రుడు శుభుడైయుండిన చక్కగా నడచును. శుక్రుడు శుభుడైయుండిన స్త్రీలకు యౌవనకాలమంతయు పురుషసుఖము

మితిమీరియుండును. కౌమారదశకు చంద్రుడే అధిపతిగాన శుభుడై యున్న చక్కగా నడచును. వృద్ధాప్యమునకు శని అధిపతిగాన శని శుభుడైయుండిన వృద్ధాప్యమున బహుముఖ్యముల సర్వసుఖము లను భవింపజేయును.

శ్రీ:- స్వామీ కొందరికి అపురూపవతిగా కావలసిన ధనముతో సద్గుణవతిగా ఇల్లాలు వచ్చును. ఎందుచేత నందురు-

వత్సా ముందు జన్మమున లక్ష్మిదేవి నర్చించి, ధ్యానించిన వారికి లభించును.

కం॥ శ్రీరమణి యొసగు ద్రవ్యము
భారతి సాహిత్యమొసగు బహుముఖములతో
గౌరి యొసంగును నాయువు
వీరిని ధ్యానించగలుగు ప్రీతిగ వత్సా.

ఈ: త్రిదేవుల నర్చించినవారికి త్రివిధ శక్తులకు ద్రవ్యము, జ్ఞానము, రూపము, నాయువు నొసంగుదురు. మానవుడు సుఖించును.

కం॥ కలుములరాణి యొసంగును
కలుములు నవనిధులతోటి కరుగనియటులన్
కలిమిని బలిమిని జగతిన్
తలమానికమైవెలుంగు తలపగ వత్సా.

కం॥ ధీరుండని ప్రజలనగను
సారసభవురాణి యొసగు సాహిత్యంబున్
సారంబగు గ్రంథంబుల
పారముగా వ్రాయుశక్తి వర్ధిలు వత్సా.

కం॥ గౌరి యొసంగును నాయువు
పౌరుషమును సాహసంబు బాహాబలంబున్
మారుని యౌవనబలమును
ధీరోదాత్తతయు యశము తెలియుము వత్సా.

వత్సా వీరు లగ్న పంచమ నవమాధిపతులుగా నుద్భవించి మానవుని సుఖింపచేతురు. ఈ ముగ్గురను ధ్యానింపక ఒక్కొక్కరిని తలంచినవారికి ఒకశక్తియే గలుగును. దానితో సంతోషింపజాలడు. త్రిశక్తులు మానవునికి ఆవశ్యకమేయగును. త్రిమత స్థాపకులు విడదీయుటవల్ల త్రిశక్తులు ఒకనియందు చేరకుండెను. లగ్నపంచమ నవమాధిపతులు నొకస్థానమున కూడియుండుట మహాకష్టము. అట్టివారు పూజనీయులై వందనీయులై ప్రకాశించుచున్నారు. నవమాధిపతి ఏకాదశమమందున్నవారు లాభము గడించి లక్షాధికారులగుచున్నారు. పంచమాధిపతి ఏకాదశమందున్నవారు విద్యాధికులై విజ్ఞానవంతులై వెలుగుచున్నారు. లగ్నాధిపతి ఏకాదశమమందున్నవారు రూపవంతులై దేహారోగ్యముగలిగి, దేహసౌష్టవమువల్ల లాభము గడింతురు. హఠాత్తు ధనప్రాప్తి గలుగువారికిట్లుండును. ఈ గ్రహములు సప్తమాష్టమములలో నుండిన సర్వము చేకూరును. సర్వసుఖములనుభవింతురు.

కం॥ ఏడిటనేగ్రహముండక
చూడకపోయినను సుఖము శూన్యంబైతా
మోడయి దుఃఖించును ధర
కాడగు కాపురమునెల్ల కనుగొన వత్సా.

కం॥ నవనాయకులేడింటను
నెవరునులేకున్న సుఖములెల్ల నశించున్
దివిభువినిన్ సుఖముండదు
చివరకు సంసారసుఖము చిత్తగు వత్సా.

కం॥ జీవచ్ఛవమగు సప్తమ
భావంబున శుభులులేనివాడు ధరిత్రిన్
చావూబ్రతుకుల మధ్యన
జీవితమున్నంతవరకు చిత్త్రగు వత్సా.

వత్సా ఏడింట యేగ్రహము లేకున్న ఆ యిల్లు నిప్పుల గుండ మగును. జీవిత మున్నంతవరకు అకాలనిద్ర, అకాలభోజనము, అకాల వివాహము సంభవించును. దుఃఖింపచేయును, ఆశలన్నియు అడు గంటును, వివాహ భోజనములు, విందుల భోజనము గుండుసున్న గును. కళత్రము కోపిష్టిగానో, రోగిష్టిగానో తయారగును. పట్టుదల గలదై చెప్పినమాట వినక దుఃఖింపచేయును. ఇంటివారి నందరిని లెక్కించక తిరుగును. భర్తను జీవచ్ఛవముగా భావించును. సారము లేని సంసారమగును. చావూ బ్రతుకులమధ్యన జీవింపవలసివచ్చును. కాపురము కాడుగా గన్పడును.

కం॥ ఏడూ ఎనిమిదిలోనన్
తోడయి ముప్వేల్పులుండ దొరుకని సుఖముల్
జోడయి యెదురయివచ్చును
వాడు మహావైభవముల వర్ధిలు వత్సా.

వత్సా ఏడిట లగ్న పంచమ నవమాధిపతులున్న వాని జన్మ సార్ధకజన్మ. తలవని తలంపుగా యెదురైవచ్చును సుఖములు. మహా వైభవములతో సుఖసంతోషములతో జీవితాంతము సుఖించును. త్రి దేవులు ముప్వురు కలిసియుండిన మైధున నిద్రాహారములు కొదువ గలుగవు. ఎందరోస్త్రీలు ఎదురై సుఖింపచేయుదురు.

కం॥ దేవీత్రితయుల పీరితిగ
భావంబున నిలిపికొలువ బహుసంపదలున్
భావిని కైవల్యంబును
నీవడుగకనే నివ్వగలరు నిజమిది వత్సా.

వత్సా త్రిదేవుల త్రిమూర్తుల మనసారా గొలుచుచుండిన సర్వ సంపదలు చేకూర్చి సుఖింపజేసి కడకు నీవడుగకనే కైవల్య మొసగ గలరు. నమ్మికతో నిత్యము ధ్యానింపుము.

కం॥ భావవిభేదము జెందక
దేవీత్రితయులనుగొలువ త్రివిధసుఖంబుల్
భావినిగల్పించియునిన్
కైవల్యపథంబుజేర్చి గాతురు వత్సా.

వత్సా భావవిభేదము జెందక ఒకరెక్కువ ఒకరు తక్కువను భేదములేక ముగ్గురను ఒకేభావముతో గొలుచుచుండిన తప్పక కైవల్యము చేర్చగలరు. వీరు త్రిశక్తులు. లక్ష్మిధనము, పార్వతి దేహ బలము, సరస్వతిజ్ఞానబలము ఈమూడుశక్తులు ఒకచోటనుండినయెడల మానవుడు సుఖించును. ఒక్కొక్కశక్తి యుండిన వారు సుఖింప జాలరు. త్రిదేవుల త్రిమూర్తుల మరువక దలచి సుఖింపుము.

శ్రీ:- స్వామి వివాహము ముహూర్తబలము స్పష్టముగా వివరింపుడు.

వత్సా సపరిమాణ జ్యోతిస్సారములో ద్వితీయ తరంగమున వివాహ ఉపనయన ముహూర్తముల విపులముగా చెప్పబడినవి పరిశీలింపుము. సూక్ష్మముగా చెప్పెదను జ్ఞాపకముంచుకొనుము- పృచ్ఛకులు నిన్నడుగవచ్చిన లగ్నమేదో తెలుసుకొని గురుపాలిత శనిపాలితముల నెరింగి ఏలగ్నజాతకమునకు ఆ లగ్నములలో లగ్నసప్తమములలో

లగ్నపంచమ నవమాధిపతులలో నొకరుండు లగ్నమేర్పరుచుము. లేదా ద్వితీయ అష్టమములలో శుభులుండు నట్లయిన చూడుము. అక్కడికి చాలును.

స్వామి వివాహ సమయములో కొందరు కొట్లాడుదురు కొందరు బంధువులు కలియరు- ఎన్నెన్నియో చిక్కులు గలుగుచుండును- కారణము సూక్ష్మముగా తెలుపుడు.

వత్సా లగ్న ద్వితీయమున పాపులున్న ఆవివాహము కుటుంబములో కొందరు ఒప్పక పరితపించుచుందురు- తృతీయమున పాపులున్న సోదర సోదరీవర్గములో కొందరు వప్పని వారుండి చింతించుచుందురు- చతుర్థమున పాపులున్న బంధుమిత్ర కలహము లేర్పడి చిక్కులకు దారితీయుచుండును. కొందరు అవివాహములో కలయరు. కొందరు కలహించి పోదురు వివాహము తల్లికి నచ్చనిదిగా నుండును. ఇట్లే యేస్థానమున పాపగ్రహములుండునో ఆస్థానమున గలుగు దుష్ఫలముగా మార్చుదురు. శుభగ్రహములున్న సత్ఫలముగా మార్చుచుందురు. గమనించుకొనుము- ఇక ఉపనయన ముహూర్తమన్ననో పంచమ నవమములలో శుభగ్రహము లుండునట్లుచూచి ముహూర్తముంచుము.

అ॥ సప్తమాష్టమముల సౌమ్యులులేకున్న
సుదతిలేదు సురతిసుఖములేదు
సప్తమాష్టమముల సౌమ్యులుగలరేని
తప్పకుండు నాల్గుదశల సుఖము.

వత్సా సప్తమ అష్టమ లగ్న ద్వితీయముల లగ్నపంచమ నవమాధిపతులుండిన సుఖ సంతోషములతో సంసారము నడుచును. లేకపోయిన నాలుగుదశలలో అనేకమైన చిక్కులకు లోనగును.

## - తారాబలము -

శ్రీ:- స్వామి నవగ్రహములకు తెలియని కార్యములున్నవా? గ్రహముల విడిచి తారాబలము లెక్కించుచున్నారే దీనికి నవగ్రహ బలాబలము అక్కరలేదా. దీనినేమనవలయును.

వత్సా ఈతారాబలము వారముల గురించి కల్పనచేసినారేగాని ప్రపంచ గ్రహబలాబలముల గమనించి కాదు- పరిపంచములకు పంచ భూతములకు కాలమునకు ఆధారభూతమైన నవగ్రహముల వాసనకూడా యిక్కడ లేదు. పరిశీలించుము- మానవుని నామనక్షత్రము నుండి దిన నక్షత్రము వరకు లెక్కించి, తొమ్మిదింట భాగింపుచేసిన ఒకటి మిగిలిన జన్మతార చెడ్డ, 2 మిగిలిన సంపత్తార మంచి, 3 మిగిలిన విపత్తార చెడ్డ, 4 క్షేమతార మంచి, 5 ప్రత్యక్తార చెడ్డ, 6 సాధనతార మంచి, 7 నైధన తార చెడ్డ, 8 మిత్రతార మంచి, 9 పరమ మిత్రతార సామాన్యము అన్నారు చెడ్డ అనకుండ.

నామనక్షత్రము నుండి దిననక్షత్రము వరకు లెక్కించి వచ్చిన సంఖ్యను నవగ్రహములతో భాగించి శేషమువచ్చిన సంఖ్యను వారము లతో పోల్చినారు రవి, కుజ, శని, రాహుకేతు గ్రహములు పాపు లనియు నిర్ణయించుటవల్ల రవి జన్మతార చంద్ర సంపత్తార కుజవిపత్తార బుధక్షేమతార గురుప్రత్యక్తార శుక్ర సాధనతార శని నైధనతార రాహు మిత్రతార కేతు పరమ మిత్రతార సామాన్యమన్నారు. గురువును మం చిలో చేర్చిన చెడ్డ మంచిఅన్నచోట క్రమముగా రాదని గురువునుకూడ చెడ్డ అని చెప్పుచు మరొకచోట ప్రత్యక్తార మంచిదేనన్నారు. రాహు వునుకూడ మంచిగా భావించకపోయిన క్రమమురాదని రాహువును మంచి దన్నారు- మరుగు పెట్టి కృత్రిమశాస్త్రమును సృష్టించినారు. ఇట్లే వాస్తుశాస్త్రములలో కూడ వారములున్నవి- దీనికన్నా దేవుని తలంచు

కొని సహదేవశాస్త్రములో రామాయణములో పుల్లపెట్టి అక్కడున్న మంచిచెడ్డల గమనించుకొనుట శ్రేయము. వీరిజాడల లెక్కింపక గ్రహముల ఫలాఫలముల తెల్పుచు గుణాలు గణాల మార్కులు వేయక గ్రహబలాబలములవల్ల గలుగు ఫలములతెలిపి ముహూర్తముంచుము.

శ్రీ:- స్వామి వివాహోపనయన, ముహూర్తములు రెండు మాత్రము చెప్పితిరి. ఇంకా ముహూర్తము లెన్నో గలవుగదా. వాటి నన్నిటను చెప్పగోరెదను- నామకరణమును గూర్చి వివరింపుడు.

## - నామకరణము -

గు:- వత్సా జననాది జాతాశౌచము పదిదినములనెదరుగదా. 11, 12, 16, 20, 22 దినములలో నామకరణము చేయవచ్చునని ఆచరణలో యున్నదిగదా పూర్వపద్ధతినే ననుసరించుట శ్రేయమేయగును- ఇందులో జనన నక్షత్రపాదము ననుసరించి పేరు పెట్టమందురు- అనగా అశ్విని నక్షత్రమైన చూచేచో అశ్విని అని యున్నదిగదా- అశ్విని నాలుగు పాదములలో ఏపాదమైన ఆ అక్షరము ప్రథమమున వచ్చునట్లు పెట్టమందురు- కొందరు ఇలువేల్పు పేరు పెట్టమందురు. ఇలువేల్పు శివుడైన గురుపాలితజాతకుడుగా- ఇలువేల్పు విష్ణువైన శనిపాలిత జాతకుడుగా జననమగుదురు. ఏ జాతకమునకు అపరముగా పేరు పెట్టుటే క్షేమము- అట్లు పెట్టుటకు వీలుగాని మతములవారున్నారు- వైష్ణవులు శంకరుని పేరు పెట్టరు. ఆరాధ్యులు విష్ణువుపేరు పెట్టరు- త్రిమూర్తులనే వీరు విభజించినారు వీరు. ఇలువేల్పు పేరు లేదా ఇష్టదైవము పేరు పెట్టుకొనుట క్షేమము- జాతకు ననుసరించి నామకరణము చేయుటలో నొకవిశేషము గలదు. ఏమన గురుపాలితులకు లగ్నపంచమ భాగ్యములు విష్ణుకోణములగును. ఆజాతకుని పూర్వపుణ్యమందే యుండును. శనిపాలితులకు లగ్నపంచమ భాగ్యములు

శివకోణములగును. ఆజాతకుని పూర్వపుణ్యమందే యుండును. గాన వారివారి నామోచ్చరణమే జాతకుడు వినుచుండుట క్షేమము. ఆదైవ ధ్యానము చేయుటే శుభము. మతము తీసుకొనినచో అసలుదారికి అడ్డు మొచ్చును- వైష్ణవులు శనిపాలితులుగా జననమగుచున్నారు. వారు ధ్యానము చేయుట విరుద్ధమగును. ఆ అధిష్టానదేవత ధ్యానము పాప ఫలమున్నచోటికి పుణ్యము, పుణ్యఫలమున్నచోటికి పాపము పోవలసి వచ్చును. తాను ముందుచేసిన పుణ్యంలో పుణ్యము, పాపంలోపాపము కలియక తిరుగబడును. అందువల్ల మిశ్రమఫల మేర్పడును. జాతకు ననుసరించి పేరు పెట్టిన పేరువల్లనే గురుశని జాతకముల తెలుసుకొన నగును. చేసిన ధ్యానము చేరవలసిన స్థానమునకే చేరును. ప్రకృత జన్మకు, రాబోవు జన్మకు క్షేమమేయగును. ఏఏజాతకునకు ఆయానామ ములనేపెట్టుట మంచిది. మతభేదమైన ఇలువేల్పుపేరు పెట్టుకొనుటో ఇష్టదైవము పేరు పెట్టుకొనుటో క్షేమము. కొందరు హిందూ సంప్ర దాయము విడచి నానామతముల పేర్ల పెట్టుకొనువారు గలరు. దీనికి కారణము తండ్రి జాతకము- తండ్రి జాతకములో అన్యదైవమును గొల్చు యోగమున్నప్పుడు సంతతికి ఇలువేల్పు పేరువిడిచి అన్యదైవ నామముల పేర్లు పెట్టును- పేరు శివయ్య, కొలుచుట రాముని- పేరు రామయ్య, కొలుచుట శివుని విరుద్ధము- శివయ్య శివుని, రామయ్య రాముని, కొలుచుచుండిన నిమిష నిమిషమునకు తనదైవముపేరు విను చుండును శ్రేయమొదవును-

## - పేరు పెట్టుట -

శ్రీ:- స్వామి జాతకము శివపర్యాయమైన శివుని పేర్లను, విష్ణుపర్యాయమైన విష్ణువు పేర్లను పెట్టుకొనుట మొదటిది, ఇలువేల్పు పేర్లను ఇష్టదైవముపేర్లను పెట్టుకొనుట రెండవది. జననసక్షత్రముతో

కలిపి పేరు పెట్టుకొనుట షూడపది అన్నారు. సరి అక్షరముల పేర్లను పురుషులకు బేసిఅక్షరముల పేర్లను స్త్రీలకు పెట్టవలయునన్నారు. శుభమే నందుర.

గు:- నామములకు బేసియని, సరియని తలప పనిలేదు. ఇందులో శుభాశుభములు రెండు లేవు. శివ కేశవ భేదము జాతకము లందు గన్పడునేగాని సరిబేసిలో లేదని గన్పడుచున్నది. స్త్రీలకు, పురుషులకు అయ్య, అమ్మ అను పదములు పేరులో కలియునట్లు చూచుకొనుట శ్రేయము- ఎట్లన కుమారి అని పేరు పెట్టిన అమ్మ అన్న పదము సంధిచేసిన కుమారెమ్మ అగును. అయ్య, అమ్మ అను పదములు సంధిచేసినను, ఏహ్యములేని నామముల పరిశీలించి పెట్టుకొనుట మంచిది- చిన్నవారు సేవకులు మొదలగువారు పిలిచిన గౌరవముగా నుండవలయును. సంప్రదాయములో అమ్మ, అయ్య అప్ప అన్నపదములు గౌరవనీయములు గాన గమనించి పెట్టుట మంచిది-

శ్రీ:- స్వామి తిథి వార నక్షత్ర యోగకరణములు అయనములు, గ్రహములు, లగ్నములు మొదలగునవి. శుభముగా నున్నప్పుడు చూచుకొని నామకరణము చేయవలయునన్నారు. ఇన్ని కుదుర గలవా.

గు:- వత్సా జననాది 11 దినమందు నామకరణము చేయ వీలుగలిగిన దేనిని పాటింప నవసరములేదు. అట్లు తటస్థింపకపోయిన దినములందైన కొంత పాటింపవలసివచ్చును. 7 ఇంట లగ్న పంచమ భాగ్యస్థానాధిపతులుండగా చేయుట క్షేమము. ఉత్తమము అటుగాకున్న లగ్న ద్వితీయ ద్వాదశ షష్టాష్టమములలో శుభగ్రహము లుండుట మధ్యమము. తిథివార నక్షత్ర యోగకరణముల రాహుకాలముల పాటింప నవసరములేదు. గ్రహబలమే ముఖ్యమని గమనించు.

## - అన్నప్రాశనము -

శ్రీ:- స్వామి అన్నప్రాశన కాల నిర్ణయములో పురుషులకు 6, 8, 10 నెలలయందును, స్త్రీలకు 5 7 9 మాసములయందును అన్నప్రాశనము చేయవచ్చునన్నారు. సరే నందుర.

గు:- వత్సా ఆహారస్థానము సప్తమముగదా. సప్తమములో శుభగ్రహమున్న మంచి ఆహారము లభ్యపడును. సకాలభోజనము సకాలనిద్ర, సకాలవిహారము, సకాలవివాహము లభ్యమగును. మృష్టాన్నము, ఫలాహారములు, విందులు లభించును. పాపగ్రహములున్న అకాల భోజనము, అకాల నిద్ర, అకాల వివాహము లభించును- మృష్టాన్నము, ఫలాహారములు విందులు మొదలగునవి హాస్యమై పోవును. గాన అన్నప్రాశనమునకు, జాతకునకు లగ్నసప్తమములకు లగ్న పంచమ నవమస్థానాధిపతులలో నొకరు వచ్చినప్పుడు చేయుట క్షేమము లేదా లగ్నమందుండవలయును. సరిబేసి మాసములతో పని లేదు- ఈజాతకమునకు జీవితాంతము మృష్టాన్న భోజనము దొరుక వలయునని కోరిచేసిన ప్రథమ దిన ఆహారము గదా- బియ్యముతో చేయబడిన క్షీరాన్నముతో శక్తికొలది పండుగచేసి బంధుమిత్రులగూడి ఇలువేల్పును పూజించి నైవేద్యముచేసి ఆక్షీరాన్నము తల్లి జాతకునకు తినిపించవలయును. జాతకు ననుసరించిన నక్షత్రము వారము లగ్నము నుండుట క్షేమము. చంద్రుడు ఆజాతకునకు పాపిగానున్న శుభులు ప్రక్కచూపులతో చూచుట మంచిది- లగ్న పంచమ నవమములలో ముహూర్తముంచుట క్షేమము- మధ్యాహ్నము లోపలనే ముహూర్త ముండవలయును.

శ్రీ:- స్వామి అన్నప్రాశన లగ్నమునకు పదియవ యింట గ్రహముండకూడదన్నారు. ఎందుకు-

గు:- వత్సా పదియవ యింటితో పనియేలేదు. శుభగ్రహ ముండుట అన్నిటకు మంచిదనియే తలంచు- అన్నప్రాశనమునకు లగ్నసప్తమములే ప్రధానమని తెలియక చెప్పిన వాక్యమని యెరుంగు.

శ్రీ;- స్వామి వృషభ కర్కాటక మిధున కన్య ధనుర్ మీన శుభలగ్నములందు అన్నారు శేషించినలగ్నములు క్రూరములనియా?

గు:- వత్సా వృషభ తులాధిపతి శుక్రుడు ఇక్కడెందుకో తులను వదలినాడు, కటకాధిపతి చంద్రుడు, మిధున కన్యాధిపతిబుధుడు ధనుర్ మీనాధిపతి గురువు ఈనలువురి గృహములే పావనములని, వీరే శుభులని శేషించినవారు వారి గృహములు పాపత్వమని భావించి తెలిపిరి. కుజ శని రవుల పాపులన్నారుగద- వారి గృహములు కూడ పాపత్వమేనని తలంచిరి యోచించరైరి. ఆ లగ్నములందు జన్మించిన వారు కూడా పాపులేనని వ్రాయుటకు భయపడి మానుకొనిరి— వత్సా ఏ లగ్నజాతకునికైన లగ్న పంచమ భాగ్యస్థానాధిపతులు, స్థానములు శుభస్కరములు గాన ముందు జాతకుని లగ్నమేదో గమనించుము. జననకాల లగ్నము లేకున్న పృచ్ఛకుడడిగిన తత్కాల లగ్నమేదో గమనించి చెప్పుము.

శ్రీ;- స్వామి తిధి వార నక్షత్రమున చెప్పినాడు. దీని నేమందురు.

గు:- వత్సా గురు శనిపాలితుల గమనించి వారి వారి నక్షత్ర ముల వారి వారి వారములలోనైన మంచిది. అట్లు కుదరని పక్షమున చంద్రుని శుభగ్రహము చూచునట్లు కుదిరించుకొనిన సర్వశుభములు చేకూరును.

శ్రీ;- స్వామి అన్నప్రాశన లగ్నమందు సూర్యుడుండిన కుష్టురోగియగునన్నాడు. రోగమునకు దీనికి సంబంధమేమున్నదందురు

గు;- వత్సా మేష, వృషభ, సింహ, వృశ్చిక, ధనస్సులకు లగ్నాత్ సూర్యుడుండిన జీవితాంతము రాజభోజనము లభింపచేయును. శేషించిన లగ్నములకు పాపి గాబట్టి అకాలనిద్రి అకాలభోజనము గలిగించి కుక్షిశూలను గల్పించును. నీచమైన ఆహారమును లభింపచేయును భుక్తశేషముల తినిపించును— కుష్టు రోగిని చేయడు.

శ్రీ;- స్వామి లగ్నాత్ క్షీణచంద్రుడుండిన దరిద్రునిగాను పూర్ణచంద్రుడున్న అన్నదాతగాను చేయునన్నారు- నిజమ—

గు;- వత్సా మీన, మేష, కటక, తులా, వృశ్చిక రాసులకు చంద్రున్న రాజభోజనము లభించును. విందులు, వివాహములు తటస్థింపచేయును. బంధుమిత్రులు పిలిచి ప్రీతిగా మధురాహారముల పెట్టుదురు. నిత్యభోజనము, అమృతోపమానమైనది దొరుకును. వీరు ముందుజన్మములో పెట్టి పుట్టినవారుగా నుందురు. శేషించిన లగ్నములవారికి అకాలనిద్రి, అకాలభోజనము గాక ఒకనాడైన భిక్షాన్నము తినునట్లు చేయును. బాల్యమున మత్తుపదార్థముల సేవింపచేయును— చలిదిఅన్నము, పాసిపోయినది, పులిసిపోయినది, మాడిపోయినది, నీచపదార్థముల తినజేయును. క్షయ వ్యాధితో కృసించునట్లుగాగాని స్థూలవ్యాధిగ్రస్తునిగాని చేయును. శుభుడై యుండిన నిత్యసంతోషిగా సర్వసౌఖ్యములతో దీర్ఘాయురారోగ్యములతో జీవింపచేయును

శ్రీ;- స్వామి లగ్నాత్ కుజుడుండిన పైత్యరోగిగా చేయునన్నాడు. నిజమే సందుర.

గు.- వత్సా మీన మేష కటక సింహ వృశ్చిక ధనుస్సులకు లగ్నాత్ కుజుడుండిన మృష్టాన్న భోజనము జీవితాంతము లభించును. బహుబలశాలియై ఏ వ్యాధికి లోబడక శతృరోగఋణవిపత్తులకజేయుడై సుఖించును. శేషించిన లగ్నములకు కౄరుడై యౌవనకాల

మంతయు కాయకష్టముతో, నీచభోజనముతో, అకాలనిద్ర, అకాల భోజనముతో ఘనతములు గుడిచినది. పిల్లలు తిన్నతిండి తినిపించును. దేహదారిద్ర్యము, ధనదారిద్ర్యముతో సుఖములేని జీవిగా చేయును. కుష్టురోగిగా చేయును

శ్రీ:- స్వామి లగ్నాత్ బుధుడుండిన విశేషజ్ఞానవంతుడగునట నిజమా-

గు:- వత్సా జ్యోతిష్యభాగమే గమనింపక వ్రాసిన వ్రాతలని తెలియుచున్నది వృషభ మిధున కన్య తుల మకర కుంభజాతకులకు షడ్రసోపేత భోజనము దేహసుఖము నిచ్చును. శేషించిన లగ్నముల వారికి భుక్తశేషాన్నముకూడ దొరుకనియ్యక బాధించును. వామాచారుడు గనుక మాంసమద్యమముల సేవించుట కులాచారముల పాటించక నీచుల చేతిఅన్నము తినుట దాస్యము చేయుట, అకాలభోజనము, అకాలనిద్ర లతో కృశించుట. పైత్యము ప్రకోపింపచేసి తిమురు జబ్బును కలి గించి బాధించుట- ఇట్టి అనేకబాధల గలిగించి పరాభవించి సుఖరహి తుని చేయును.

శ్రీ:- స్వామి లగ్నాత్ గురుడుండిన మిక్కిలి భోగవంతు డగునట నిజమేనందుర.

గు:- వత్సా మీన మేష కటక సింహ వృశ్చిక ధనస్సులకు లగ్నాత్ గురుడుండుట పూర్వజన్మ సుకృతమనవలయును. వివాహ భోజనములు, విందుల ఆహారము, దైవనివేదనాన్నము, నిత్యషడ్ర సోపేతభోజనము, బంధుమిత్రులు పిలిచి ప్రీతిగా మధురాహారము లిచ్చుట లభింపచేయును. గౌరవనీయుడుగా జీవితాంతము జీవింప చేయును- శేషించిన లగ్నములకు భుక్తశేషాన్నము అకాలనిద్ర, అకాలభోజనము అకాలప్రయాణములు బ్రాహ్మణార్థములు గుడుచుట,

అపరకర్మలలో పాల్గొనుట, నీచాహారముల తినుట, పరాన్నజీవియని పేరు గడించుట, పరులపంచల పరుండుట చేయును. చేయించును—

శ్రీ:- స్వామి లగ్నాత్ శుక్రుడుండిన దీర్ఘాయువుగల వాడగునట తామేమనెదరు—

గు:- వత్సా గురు శుక్ర శుద్ధ బుధ పూర్ణచంద్రులు శుభులని నియమించుకున్నారుగదా. ఆబద్ధతిని ఇక్కడ చూపించినారు. వేరే మార్గమేమీకాదు. లగ్నాత్ శుభాశుభత్వము గ్రహములకు గలిగెనని తోచలేదు- శనిపాలితలగ్నములగు వృషభ మిథున కన్య తుల మకర కుంభ లగ్నములకు శుక్రుడు లగ్నాత్ లగ్నసప్తమములో శుభప్రదుడగును. మంచిమంచి విందుభోజనములు లభింపచేయును. అమృతోపమానమైన నిత్యభోజనము చేకూర్చును. మైథున నిద్రాహారములకు ఏలోటు గలుగదు ఆయురారోగ్యభాగ్యములు లభింపచేయును- శేషించిన లగ్నములకు మృత్యువై బాధించి వేధించును. సప్తవ్యసనముల తోడుచేసి అకాలనిద్ర, అకాలభోజనము సృజించును. స్త్రీలతో పరాభవములు తప్పవు. వామాచారుడు గాబట్టి మాంసమద్యముల నలవరచి సాటివారిలో అవమానపరచును. క్షుద్రాహారములతో జీవింపచేయును. సంసారము నరకముగా మార్చును. అండవ్యాధిని సృష్టించునని తెలుసుకొనుము.

శ్రీ:- స్వామి అన్నప్రాశన లగ్నాత్ శని యుండిన వాతరోగియగునన్నాడు. నిజమే నందుర.

గు:- నాయనా శని, కుజ, రవి, రాహు, కేతు గ్రహములు నైసర్గికపాపులుగా నియమించినారు. గాబట్టి శాస్త్రజ్ఞులందరు ఇట్లే వ్రాసిరి. అనుభవజ్ఞులుండినను నోరు మెదల్చుటకు భయపడి యూరకుండిరి. సకల ప్రపంచమున సగబాలు అధికారము గలిగి ఆయుః

కారకుడై ఈశ్వరాంశజుడై యున్న శనిని శుద్ధపాపియని సర్వశుభకార్యములందు బహిష్కరించిరి. దీనితో జ్యోతిశ్శాస్త్రము సర్వము దక్షయజ్ఞమయ్యెను. శివుని బహిష్కరించి చేసిన దక్షయజ్ఞమేమాయెనో శని కుజ రవి రాహుకేతువులను నైసర్గిక పాపులని బహిష్కరించి వీరి శాస్త్రములన్నియు దక్షయజ్ఞమయ్యెనని తలంచు. శనిపాలిత లగ్నములకు శని లగ్నాత్ యుండెనేని తనయింటికన్న బంధుమిత్ర గృహములలో విందు, వినోదభోజనముల ప్రీతిగా నిప్పించును. వామాచారులకు నిత్యము మాంసమధ్యమములతో బోజనము సమకూర్చును, శాఖాహారులకు శాఖాహారములతో బ్రాహ్మణార్ధ భోజనముల సమకూర్చును. బంధుమిత్రులు ప్రీతిగా బిలచి విందుభోజనముల పెట్టుదురు. గురు లగ్నముల యందుండిన భుక్తశేషముల తినిపించును. పులిసినది పాసిపోయినది, మాడినది, చెడిపోయినది చిద్రాహారముల భుజింపచేయును. పరాన్నజీవిగా తయారుచేయును. తిండిపోతుగాచేసి తిట్లు తినిపించును. ధనికునికైన ఆహారకోశవ్యాధుల సృష్టించి జీర్ణకోశము చెరచి పత్తెపత్తెముల గల్పించి ఇంటి వారందరు మృష్టాన్నముల తినుచుండగా తనకు మాత్రము క్షుదభోజనము తప్పదు. పత్తెపత్తెములు నెత్తి నుండును

శ్రీ:- స్వామి లగ్నాత్ రాహు కేతువులుండిన దరిద్రుడగునన్నాడు నిజమా?

గు:- వత్సా గురులగ్నములకు కేతువు శనిలగ్నములకు రాహువు సప్తమ మందుండుట మంచిది. ఆహారలోకు వుండదు. దారిద్ర్యములేదు. ఇట్టి భయము గల్పించినగాని, మానవులు మాట వినరను ఉద్దేశ్యముతో వ్రాసిరేగాని వేరొకటిగాదని తలంచు. స్థానమును బట్టి ఫలముండునుగాని వీరు చెప్పినట్లు నడువదని తెలుసుకొనుము.

## - కేశఖండనము -

శ్రీ:- స్వామి కేశఖండన ముహూర్త్తమునకు కాలనిర్ణయము చేయుటలో సరినెలలు పురుషులకు, బేసినెలలు స్త్రీలకు నియమించి ఉత్త్రాయణము, పూర్వయామము కావలయునన్నాడు. ఇక తిథి వార నియమము యథాప్రకారమే చెప్పి పూర్ణతిథి కావలయునన్నాడు. తామే మందురు-

గు;- నాయనా మాస అయన నియమము లేదు. జననము మొదలుకొని ఎప్పుడైన శిశువు ఆరోగ్యము చూచుకొని సమయాను కూలముగా లగ్నసప్తమములకు శుభగ్రహములు వచ్చినప్పుడు గురు శనిపాలిత లగ్నముల గమనించి వారివారి నక్షత్రవారములలో చంద్రుని శుభగ్రహములు చూచునట్లు చూచుకొని చంద్రుడు శుభుడైన ఎవ్వరు చూడనక్కరలేదు. పాపులు చూడని సమయ మెరింగి ఆదినములలో కేశఖండనము చేయించవచ్చును- ఇలువేల్పు దేవుని ఆలయము దగ్గర ఇష్టదైవాలయము వద్ద కొందరు తీయించుకొందురు. ఇంటివద్దనే కొందరు తీయించుకొందురు- కొందరు బేసి నెలలకొరకై బేసి సంవత్సరముల కొరకై చూపెట్టు కొందురు. దీనిని శాస్త్రజ్ఞులు సృష్టించిరి గాని ఆచరణయోగ్యమైనది గాదు. దీనికి నియమము లగ్నసప్తమము లకు శుభగ్రహము లొచ్చుటొక్కటేనని తలంచుకొనుము. వీటిని లెక్కించిన శుభగ్రహబలము దొరుకదు గాన సరి బేసిని విడచి గ్రహ బలము చూచుకొనుము.

## - చెవులు కుట్టుటకు -

శ్రీ:- స్వామి కర్ణవేధ (చెవులు కుట్టుట) కాలము 12, 16 దినములందైనను కర్ణవేధ లగ్నమున కెనిమిదవయింటనే గ్రహములు

లేకుండగా పూర్ణతిది నక్షత్రములయందు చెవులు కుట్టవలయునన్నాడు. ఇక తిది వారనక్షత్రములు రాసులు యధారీతిగానే చెప్పెను. పూర్ణతిథి నక్షత్రములకు బలమున్నదందురా? కాలములో శక్తియున్నదందురా?

గు:- నాయనా కర్ణవేధ కేశఖండన దినమందే జరుపుకొను వారు మెండుగా నున్నారు. (ఇది ఒకమతము) ప్రత్యేకించి కేశఖండ నమునకు మునుపె కర్ణవేధను జరుపుకొనువారు తక్కువ పుట్టువెంట్రు కలు తీయించునప్పుతే చెవులు కుట్టుట మంచిది. లగ్నమునకు ఎనిమి దింట ఏగ్రహముండకూడదనుట శాస్త్రదూష్యము. శుభగ్రహమున్న మంచిది- పాపగ్రహమున్న అశుభముండును గాని ఏదిలేకుండిన శుభ మెట్లు గలుగునో యేల్లవానికెరుక— ఇక పూర్ణతిథినక్షత్రములన్ననో ఎక్కువ తక్కువలు లేనివి. తక్కువ ఇది లెక్కలు కుదిరించుటలో వచ్చినవేగాని ఇందులో శుభాశుభములు గానము— వీటికి కారకత్వ ములులేవు గాబట్టి నిర్జీవ ప్రతిమలు. గ్రహమేదోవకటి ఆనక్షత్రము పైకి వచ్చినప్పుడే అందులోగల వస్తువును ప్రసారమునకు వచ్చును. గ్రహములేనప్పుడు నక్షత్రము నిర్జీవము వీటిని లెక్కింపకుము. ఇక వారములు, నక్షత్రములు లగ్నము ననుసరించి పరిశీలించుకొనుము.

శ్రీ:- స్వామి 12, 16 దినములందు ఆకసిగందువులకు చెవులు కుట్టుమనుట, ఆరునెలలలో పుట్టువెంట్రుకలు తీయించమనుట ఘోరమనుకొందును—

గు:- అవును కరుణలేనిశాస్త్రములు అనేకమున్నవి. ఈశాస్త్ర ములనమ్మి 6 నెలల పసికూనలకు తిరుపతి వెంకటరమణస్వామి దగ్గర వెంట్రుకల తీయించుచుండ చూచిన పసికూనల యేడ్పుల నరకలోక మక్కడనేగానవచ్చును—ఆరోదన లాలించిన జాలిగలవారి గుండె లవిసి పోవును. ఎంతటి కఠినులీశాస్త్రము సృష్టించిరను ఆలోచన గలుగును.

ఆభీతితో కొందరికి జ్వరమువచ్చును. ఇదిగాక పుట్టిన మూడవదినము ననే బొడ్డుచుట్టు వాతలు వేయుట, ముక్కు చెవులు కుట్టుట, ఎంగిలాకులలో పొర్లించుట మొదలగు ఆచారములు ఎన్నో గల్పించినారు. శాస్త్రకార కులు కొన్ని పెద్దలమనిపించుకొన్నవారు కొన్ని కులాచారములని కుల పెద్దలు కొన్నిగల్పించిన విపరీతము లనేకము మానవుల బాధించు చున్నవి. పిల్లవానికి ఆరోగ్యము బాగున్నప్పుడు కొంచము దేహబలము గలిగినప్పుడు సంవత్సరము గడచిన తదుపరి తీయించుట, కుట్టించుట మంచిది- కొందరు బంధుమిత్రుల పిలుచుకొని ఆచారవ్యవహారములతో కర్ణవేధ కేశఖండనము నడుపుకొందురు. దేశమర్యాదలనేకముగాగలవు లగ్నసప్తమములలో శుభగ్రహములున్నప్పుడు సంవత్సరముల నెలల లెక్కింపక యజమాని తగుసమయము చూచుకొని కేశఖండన కర్ణవే ధల నడపుకొనుట శ్రేయము- కాలములో మహామహిమలుసరిబేసిలో అదృష్టదురదృష్టములు గానరావు లేవు అట్లాకగెట్టు బలముగా వేయు కుండిన ఎన్నాళ్లయిన పూరకుందురని కల్పించిన కల్పనాకథ- బీదలకు కష్టముగా నున్నది. పిల్లలకు మృత్యుప్రదముగానున్నది. పదిడబ్బులు చేతిలో గలిగినప్పుడు ఎప్పుడైనా చేసుకొనవచ్చును. ఇందులో శుభా శుభములు లేవు.

## -: రజస్వల :-

శ్రీ:- స్వామి రజస్వల విషయమై అసాధ్యముగా శాస్త్రకార కులు చెప్పిరి. ఈశాస్త్రము విని కన్యక ఆమె తల్లిదండ్రులు దుఃఖిం తురని దలంతును. తిథి వారనక్షత్రయోగకరణములు సుఖదుఃఖముల గలిగించునా? ఆసమయలగ్నములో అదృష్ట దురదృష్టముల గలిగించు శక్తియున్నదా? కాలచక్రమునకు గ్రహములే ప్రాణమన్నారే. వీ రెండు కిట్లు తెలిపిరో తెలియజేయుడు-

గు:- నాయనా శాస్త్రకారకులు పురుషుడు సుఖదుఃఖములకు కారకుడన్నమాట మరచి స్త్రీలపై విరుచుకపడినారు. ఇది ఆచరణ యోగ్యమైనదిగాదు. ఆ అమ్మాయి జాతకములో అష్టమశుద్ధి, సురత సుఖమును, ఆయురారోగ్యములను చూపును. అష్టమమందున్న పాప గ్రహములు సురతసుఖరహితయనియు, అధమాయుర్దాయయనియు తెలుపును. దీని ననుసరించి రజస్వలకాలము చూపును, గాని వేరొకటి గాదు. అది తెలియక అనేకమార్గముల చెప్పి చీకాకు, చింత గలిగించి నారు- రజస్వలైన కాలము కన్యక ఒకప్పుడు చెప్పలేని స్థితి యేర్ప డును సిగ్గుతో చెప్పలేకుందురు- నిద్రియందే కొందరగుదురు. గాన అయిన కాలము చక్కగా దొరకదు. తల్లిదండ్రులు జోస్యుని అడిగిన కాలము చూచుకొని లగ్నమేర్పరచి అష్టమ శుభాశుభము లెట్లున్నవో గమనించవలయును- అష్టమమున లగ్నపంచమభాగ్యస్థానాధిపతులుం డినను చూచినను సౌఖ్యముండును- భాగ్యస్థానాధిపతియుండిన ప్రబల సుఖముండును. భాగ్యాధిపతియే పతిగా లభించును. లగ్నపంచమాధిపతి యుండిన సౌఖ్యముండును. విద్యావినయసంపదలుగల భర్త దొరుకును. లగ్నాధిపతియుండిన దేహదారుఢ్యము రూపముగల భర్తతో జీవి తాంతము సుఖించును. పాపగ్రహములున్న రోగిష్టి, కోపిష్టియై యౌవనకొరతగలవాడు లభించును. సప్తమమున శుభగ్రిహమున్నను చూచినను సంసారము చక్కగా నడచిపోవును. భార్యాభర్తలకు అన్యోన్యముండును. అష్టమ సుఖము కొరత గలుగదు.

శ్రీ;- స్వామి భరణి, కృతిక, ఆరుద్రి, పునర్వసు, ఆశ్లేష, మఖ, పుబ్బ, జ్యేష్ఠ, పూర్వాషాడ, పూర్వాభాద్రి ఈ 10 నక్షత్రముల యందు రజస్వలైన అశుభమన్నారు నిజమ?

గు;- నక్షత్రములకు అధిపతుల సృష్టించుకొన్నారు గాబట్టి

ఈ నక్షత్రాధిపతులు క్రూరులని దుష్టనక్షత్రములన్నారు. వాన్ని ముహూర్తములకు వాడినారు.

వత్సా దిననక్షత్రముపై చంద్రుడుండును చంద్రుడా ఆయా నక్షత్రమా చంద్రుడు ఆలగ్నమునకు పాపియైనప్పుడు నక్షత్రము పాప త్వము చెందదా? గ్రహములేక నక్షత్రము సుఖదుఃఖముల ప్రసారించునా? నక్షత్రమునుబట్టి చంద్రుడుకూడ శుభుడగునా? లగ్నమునుబట్టి లేక శుభాశుభత్వము లెట్లు గలుగును. చంద్రుడు ఎక్కడున్నా శుభుడనియా? చంద్రునికి శత్రువులుతేరనియా అన్న ప్రశ్నలకు విమర్శ లేని శాస్త్రమైనది. ఎద్దు ఈనినదనిన గాటకట్టివేయనున్నట్లు చెప్పినారు మీన మేష కటక తులా వృశ్చిక లగ్నములకు చంద్రుడు శుభుడుగదా ఈలగ్నములకు చంద్రుడెక్కడుండినా ఏ నక్షత్రముపైనుండినా శుభ ఫలమే యిచ్చును, వీరు దుష్టనక్షత్రమన్న దానిపై నుండినను శుభమే గద. అప్పుడుకూడ అశుభనక్షత్రమేనందురు. చంద్రుని లెక్కింపరు- శేషించిన వృషభ మిధున సింహ కన్య ధనుర్ మకర కుంభలగ్నములకు చంద్రుడే పాపియైనప్పుడు ఆనక్షత్రము పాపత్వము చెందునుగద అదియేనక్షత్రమైననేమి. పాపఫలమే ప్రసారము చేయును. ఇది విమర్శించని శాస్త్రమైనది. ఒకనక్షత్రమే అంతటి పాపఫలమిచ్చిన గ్రహములన్నియు ఏమిచేయుచుండును- వత్సా చంద్రుడు శుభుడైన నక్షత్రము శుభమే. చంద్రుడు పాపియైన నక్షత్రము పాపత్వము చెందునని యెరుంగుము-

శ్రీ;- స్వామి వారములలో సోమ, బుధ, గురు, శుక్రవారములలో రజస్వలైన మంగళకరము. ఆది, మంగళ, శనివారములందైన అమంగళకరమన్నారు. దీని నేమందురు.

గు;- నాయనా నవగ్రహములలో గురు, శుక్ర, బుధ,

చంద్రులు శుభులనియు రవి కుజ శనులు పాపులని చెప్పినారుగదా ? అందువల్ల పాపుల వారములకు ఆది, మంగళ, శనివారముల వర్జించి వీరిని నైసర్గికపాపులనిరి. వీరి వారములలో అయిన కీడని తెలిపిరి. వీరు మువ్వురు లేక బ్రహ్మాండమేలేదని యెరుగరైరి. గురుపాలితులకు ఆది మంగళ గురువారములు శనిపాలితులకు, బుధ శుక్ర శనివారములు శ్రేయస్కరమని యెరుంగుము.

శ్రీ:- స్వామితామన్నట్లు వారు ఎన్నుకొన్న శుభగ్రహరాసులనే చెప్పినారు. హోరాలో చంద్రహోరనే తీసుకొని పాపగ్రహ హోరాయని, సూర్యహోరా పాపమన్నారు. ద్రేక్కాణములు నవాంశ ద్వాదశాంశ త్రింశాంశములు శుభకరమన్నారు. ఇంకా ఎన్నియోచెప్పి శుభగ్రహములు రజస్వలైన లగ్నమందు లగ్నమునకు రెండు నాలుగు అయిదు ఏడు తొమ్మిది పది పదునొకండు ఇండ్లలో నుండెనేని శుభమన్నారు. పాపగ్రహములు 3 6 11 స్థానములందున్న శుభమన్నారు. శుభులు ఎక్కడున్నా శుభమే. పాపులు ఎక్కడున్నా పాపమేనని వారెందుకు వ్రాయలేదందురు.

గు:- నాయనా గ్రహవిభజన చేసుకొని యుండిన రవి కుజ శనుల రాహుకేతువుల నైసర్గిక పాపులనరు. జోస్యము చక్కగానే యుండియుండును. పునాది చక్కగా లేనందున మేడంతయు నిలుచు కొన వీలులేకున్నది. చెప్పిన విషయములన్నియు వట్టిగుడికి నమస్కరించినట్లున్నది శాస్త్రదూష్యమై పోయినది.

వత్సా రజస్వల అయినదనగా సురతసుఖమనుభవించుటకు ఆటంకము తీరినది. అదును ఎదురైనదన్నమాట. రజస్వల అయినదనిన, ముట్టు అయినదన్నమాట, పుష్పవతి అయినదా అంటారు పుష్పము ముకుళించి యున్నది వికసించినదన్నమాట. అమ్మాయి ఎదిగినదా

అనెదరు దేనికి ఎదిగినది సుఖించుటకు ఎదిగినదా అనుట సంపుత్తాడినదా, సమర్తైయినదా అనెదరు అనగా ప్రథమ ఋతుసంబంధినదా అనుట అట్లయిన దాదిగా యౌవనవతి యౌవనకాలము వచ్చినది, బాల్యము దాటినది, సుఖింపవలను గలిగినది అన్నమాట. రజస్వల యినకాలముతో పనిలేదు. తల్లిదండ్రులువచ్చి అడిగినకాలము చూచి లగ్న మేదో కనుగొని చూడతగినదేది అన్నప్రశ్నగాపలయును. కాలమాత్రయికి యౌవనకాల సుఖమెట్లుండును. కౌమార, వృద్ధాప్యకాలసుఖమెట్లుండును. భార్యాభర్తలన్యోన్యముగ సుఖించుకాలమున్నదా లేక సుఖరహితులైన యౌవన కౌమార వృద్ధాప్యకాలములలో దేనిలోనగును అన్నప్రశ్నలు ముఖ్యమైనవి. జననకాల జన్మలగ్నాష్టమము ననుసరించి రజస్వల యగును గాని వేరువిధముగా గాదు. దీనికి శాస్త్రకారకులు భారతమంత సృష్టించినారు. దృక్కునకు రాగలిగినది, చెప్పతగినది వినతగినది ఒక్కటిలేదు.

లగ్నము నందు లగ్నమునకు 2 4 5 7 9 10 11 ఇంట శుభులున్న శుభమనుట చూడవింతగానున్నది— మకర, కుంభ, వృషభ, మిధున కన్య తులలకు గురుచంద్రులున్న సర్వనాశనము చేయుదురు. మీన మేష కటక సింహ వృశ్చిక ధనుస్సులకు, బుధ శుక్రులుండిన సర్వదారిద్ర్యములతో కృంగిపోవలసియుండును. శాస్త్రమందేయుండిన త్రిషడష్టాయరిప్ఫేశ విపరీత ఫలప్రదాః అన్నశ్లోకము చదివి ఇట్లెందు కనిరనిన నైసర్గిక శుభులు పాపులు అని విడదీయుటలో ఈశ్లోకమంతరించినది. తులారాశికి 3, 6 ఇంటివాడగు గురుని శుభుడనుట చూడ నైసర్గికబలము హెచ్చి శ్లోకార్థమును నాశనముచేసి జ్యోతిని ఆర్పినది. గాఢాంధకారమైనదని తేలుచున్నది- వశ్యా వారడుగతగినది చెప్పతగినది అష్టమశుభమేగాని వేరొకటిగాదు. మానవునికిగాని మరేజీవులకుగాని మైధున నిద్రాహారములు ప్రధానములు. ఈ మూడుశుభస్కార

ముగా నుండిన వాటి ననుసరించి నూటికియాభై భాగలజీవితము చక్కగా నుండును. జీవితాశయములలో ప్రధానములుగాన సప్తమాష్టమబల మెట్లున్నదని వారడుగవలయును- జోస్యుడు చెప్పవలయును. జాతక బలాబలములు ముందే తెలిసియుండిన, తెలిపియుండిన వారడుగరు, రజస్వల ముహూర్తబలమదేనని తెలుసుకొనుము. నక్షత్రములు, వారములు, రాసులు గురు శనిపాలితముల గమనించి చూచుకొనవల యును, గ్రహాబలమనిన లగ్నసప్తమముల ద్వితీయాష్టమముల శుభు లుండుట క్షేమము. ఈ 7 వ శ్లోకఫలము వ్యర్థమని తలంచుకొనుము-

శ్రీ:- స్వామి 8 వ శ్లోకమున మఖ ఆరుద్రలో రజస్వలైన దుఃఖియు పునర్వసులో వ్యభిచారిణియు ఇట్లు నక్షత్రాధిపతులు వారాధి పతులు పాపులనివారు భావించిన వాటిలో అయినట్లయిన దుఃఖ వ్యభి చారిణి, దారిద్ర్యాలు, విధవ, గోడ్రాలగునన్నారు. దీనినేమందురు-

గు:- నాయనా ఇదివరకు చెప్పితినిగదా. నక్షత్ర బలము వారబలము ఈనక్షత్రములకు రాసులకు ప్రాణమిచ్చునవి గ్రహములు గ్రహములులేని రాసులు, నక్షత్రములు అప్రాణిచయములు ఇదితెలి యక పలికిన చిలుకపలుకుగాని శాస్త్రముగాదు. సకలజీవుల సుఖ దుఃఖములు నవగ్రహాకేంద్రము లందున్నవని యెరుంగుము. వారు చెప్పినవన్ని అశుభకరముగా నుండినను, ద్వితీయాష్టమములందు శుభ గ్రహములుండిన శుభమేగలుగునని తలంచు- వారుచెప్పినవన్ని శుభ ముగానుండినను ద్వితీయాష్టమముల పాపగ్రహములున్న సుఖముండ దని యెరుంగుము- ఈశ్లోకమున చెప్పినవన్ని వ్యర్థములని తెలుసు కొనుము.

శ్రీ:- స్వామి ఈతొమ్మిదవ శ్లోకమున సూర్యోదయ సూర్యా స్తమయములందు అన్నాడు సంధికాలమనియా?

గు:- నాయనా కాలమునకు సంధియెక్కడాలేదు. అయినా ఇది దినసంధియనుకొన్నను- ఇదికూడ లగ్నములోనే వుండును. లగ్నముపేరు లేక క్షణకాలముకూడలేదు. లగ్నముండిన-లగ్నమునకు గ్రహము లెక్కడెక్కడుండునో ఆయావనిచేయుచునే యుండును. ఈ సంధికాలముల గ్రహములకాదని సుఖదుఃఖముల గలిగింపజాలవని యెరింగి లగ్నమునే పరిశీలించుము.

శ్రీ:- స్వామి గ్రహణకాలములో సముద్ర అయిన చెడ్డ దన్నాడు నిజమా మంచిచెడ్డలున్నవా?

గు:- వత్సా గ్రహణము గురుజాతకులకు లగ్న ద్వితీయ సప్తమాష్టమములలో రాహుగ్రస్త గ్రహణమైన శుభగ్రహదీక్షణ గ్రహణముపై లేకున్న అశుభమని భావింపవలయును- కేతుగ్రస్తమైన శుభమేనని తలంపవలయును- ఇట్లే శనిపాలితులకు రాహుగ్రస్త గ్రహణము శుభము. కేతుగ్రస్తగ్రహణము లగ్న ద్వితీయ సప్తమాష్టమములందు కీడని భావింపుము-

శ్రీ:- స్వామి అమావాస్య పున్నమ కృష్ణాష్టమి కృష్ణచతుర్దశి అనుటలో అర్థమేమందురు.

గు:- నాయనా అమావాస్యయనిన చంద్రుడు సూర్యుని వెనుకకుపోయి కానరాకుండుట, పున్నమ సూర్యునికి ఏడింట ఎదురుగా నుండుట- మేష వృశ్చిక లగ్నములకు పున్నమ అమావాస్యలు శుభ ఫలమే యొసంగును. (సూర్యచంద్రు లిరువురు శుభు లగుటవల్ల) వృషభలగ్నమునకు అమావాస్య మంచిది. చంద్రుడు తృతీయాధిపతియై సూర్యునిలో కలిసిపోవుటవల్ల పున్నమ సమానఫలమిచ్చును- (మధ్య కటకలగ్నమునకు అమావాస్య చెడ్డ. (లగ్నాధిపతి సూర్యునిలో కలియుటవల్ల) పున్నమ మధ్యమము సింహాలగ్నమునకు

అమావాస్య మంచిది. (వ్యయస్థానాధిపతి చంద్రుడు లగ్నాధిపతితో లయమగుటచేత పున్నమ మధ్యమము- మిథున, కన్య, మకర, కుంభ ములకు పున్నమ మహాకీడు. అమావాస్య కొంతమేలు. చంద్రదోషము కొంత తగ్గును. తులారాసికి పున్నమ మధ్యమము అమావాస్య కీడు, (దశమాధిపతి లయమగుటవల్ల) మీనమునకు పున్నమ మధ్యమము అమావాస్య కీడు- ధనస్సుకు అమావాస్య మేలు. పున్నమ మధ్యమము ఎందుకనగా ఉదా- ధనస్సుకు సూర్యుడు భాగ్యస్థానాధిపతి శుభుడు చంద్రుడు అష్టమాధిపత్యదోషమువల్ల పాపి. అమావాస్యతో కలిసి అశుభఫలముల గలిగింపలేకుండును- పున్నమయిన ఒకరికొకరు ఎదురు గాబట్టి చంద్రుని బలము సూర్యుడు నశింపచేయును గాన శుభుడు అశుభుడుగా, అశుభుడు శుభుడుగా మారును— అమావాస్యలలో చంద్రుడు వెనుకనుండెనా, సూర్యుడు వెనుకనుండెనా, ఇద్దరు ఒకేనక్షత్ర ములో ఒకేపాదములోనుండిరా అన్నవిషయములో మేలు కీడు గమ నించవలయును. చంద్రుడు వెనుకనుండిన మీన మేష కటక తుల వృశ్చికములకు మేలు. (చంద్రుడు శుభుడు గాబట్టి) వృషభ సింహ ధనస్సులకు చంద్రుడు సూర్యునకు ముందుండుట క్షేమము- (శుభుడు గాబట్టి) ఇరువురు ఒకపాదమునయుండ చంద్రబలము నశించును— ఇట్లే అన్ని లగ్నముల గమనింపుము. అమావాస్యలో జననమైన వారికికూడ ఇట్లే యుండునని యెరుంగుము—

శ్రీ:- స్వామి కృష్ణాష్టమి కృష్ణచతుర్దశి అన్నాడు. శుక్లాష్టమి చతుర్దశిని మళ్లీవాడినాడు, చెప్పినదే చెప్పినాడు. దీనినేమందురు-

గు:- వత్సా కృష్ణాష్టమి చతుర్దశి చంద్రబలములేనివని శుక్లా ష్టమి పక్షములో సంధికాలమని, చతుర్దశిని పున్నమ సమీపమని వీటికి అధిపతులు క్రూరులని వారిభావము గాబట్టి చెప్పిరి. నీవు వీటిని లెక్కింపక లగ్నాష్టమబలమునే చూచుకొనుము.

శ్రీ:- స్వామి మేషాది సంక్రమణముల చెప్పినారు. దీనిలో ఏమున్నది.

గు:- వత్సా సంక్రమణ మనగా సూర్యుడు ఒకయింటి నుండి మరొకయింటికి మారుదినము, దీనిని సంక్రమణమందురు. మాతృ పితృలకు తర్పణము విడిచెదరు- పృచ్ఛకులు నిన్నడిగిన కాలమునకు సూర్యుడు తానున్నయింటిలో రాశ్యాంతమున నుండును గాన దుర్బ లుడై యుండును, అడిగినకాలమునకు ముందే ముందు యింటికి పోయివుండిన రాశిలో ప్రధమపాదస్థితుడై యుండును గాబట్టి మహాబల వంతుడై యుండును- నిన్నడిగిన లగ్నమునకు శుభుడో అశుభుడో గమనించి ఫలము చెప్పుము. సంక్రమణములో శుభాశుభములు లగ్న మునుండియే గలుగును గాని వేరొకటిగాదు. సంక్రమణము తర్పణ కాలము అశుభమని భావించిరి. విమర్శించక చెప్పిన మాటలని అష్టమ బలమునే చూడుము.

శ్రీ:- యోగములు, కరణములు, తిథులు యధాప్రకారమే చెప్పెను.

గు:- వత్సా ఇవి అనామధేయములని వదలుము.

శ్రీ:- మూడుతిథులు గలిసినవారమును మూడువారములతో గలసిన తిథులు దోషమన్నాడు,

గు:- వత్సా ఇవి నీటిబుడగలు శాస్త్రముగానివిగా భావింపుము

శ్రీ:- కృత్తికాది దుష్టనక్షత్రములయందు సూర్యుడుండ గాను దోషమన్నాడు.

గు:- ఇది మరింత శాస్త్రదూష్యము. సూర్యుడు వారన్న మంచి నక్షత్రములపై నుండిన మంచియని లేదుగదా. క్రూరుడు క్రూరుడేగద. మళ్లీ ఆప్రశంశ ఎందుకు. వత్సా నేనేమి చెప్పుచున్నానని

వారిమాట వారికే అర్థముగాక చెప్పినమాట ఆలగ్నమునకు సూర్యుడు శుభుడో అశుభుడో యెరింగి అష్టమశుద్ధిని చూడుము-

శ్రీ:- స్వామి త్యాజ్యకాలము రాహుకాలము యమగండ కాలములో దోషమన్నాడు.

గు:- వత్సా క్షణికకాలముకూడ ఎడతెరిపిఇవ్వక ఒకలగ్నము పోయిన ఒకలగ్నము వచ్చును. లగ్నము ననుసరించి గ్రహమండలములు, గ్రిహములు, సుఖదుఃఖముల సర్వజీవులకు ప్రసాదించుచున్నవికదా- ఈమధ్యలో తిథివారనక్షత్రి యోగకరణములు, త్యాజ్యములు. రాహుకాలములు, యమగండకాలము, గ్రిహబలముకాదని సుఖదుఃఖముల గలిగించుశక్తియున్నదా? కాలచక్రిమును నడిపించు బలముగదా? ఈరాహుకాలము పగలు 12 గంటలలో నిత్యము 1-30 నిమిషములకాలము కీడు గలిగించుశక్తి వీనికెట్లు గలిగినది. నవగ్రహములలోగల రాహువా లేక వీడొకడని బావింపవలయునా- ఆబాలగోపాలమునకు కీడే దలంచునా లేక కొందరికి మేలుగా నుండునా అన్న ఏ విమర్శలేని కాలమును తెచ్చి నెత్తిపై నుంచినారని తలంచు- వత్సా బండి క్రిందబడిన నల్లేరువిధముగా ఈ నవగ్రిహకిరణముల ముందట ఈకాలములు ఈతిథివారనక్షత్రియోగకిరణములు మొదలైనవి నుసియై గాలిలో కలసిపోవును. ఇది కల్పితగాథ నమ్మబోకుము తాను చేయదలంచిన లగ్నమునకు గ్రహము లెచ్చపెచ్చటనుండునో ఆఫలము ప్రసారమగుచునేయుండును. ప్రతిలగ్నము కొందరికి శుభము, కొందరికి అశుభము గలిగించుచునేయుండును. గురు శనులు సంవత్సరఫలమును మాసఫలము, రవి శుక్రి కుజ బుధులును దినఫలము చంద్రుిడిచ్చును. కాలము నడిపించుచునే ఉన్నారు గాని వీరు అడ్డము వేసిన కట్లకు ఈ బండి ఆగదని అష్టమ బలాబలములనే గమనింపుము-

శ్రీ:- స్వామి పెనిమిటి రాసికి ఎనిమిదవయింట చంద్రు డుండగా సమర్తాడిన దోషమన్నాడు.

గు:- నాయనా రాసిపేరు చెప్పరపోయిన జోస్యము గ్రుడ్డి దగును. మీన, మేష, కటక, వృశ్చిక, తులా రాసులవారికి శుభసౌ చేటూర్చును. శేషించిన రాసులకు అశుభము అయినా ఇది సిద్ధము కృత్రిమము. స్త్రీలను బాధించుటకు వ్రాసిన శాస్త్రమనియే చెప్ప వలయును. ఎందుకనగా ఒక రజస్వలైన కాలమే ఇంత బాధించిన ఇక జన్మలగ్నమేమి కావలయును. సంసారమునకు కారకుడైన పురుషుని జాతకమేమి కావలయును. గృహస్తుని యింటను లేద గృహిణి గృహము, గృహోపకరణములు వీటినన్నిటిని లెక్కింపక రజస్వలైన కాలముతో స్త్రీలనింత బాధించుట చూడగా శాస్త్రదూష్యము గదా. ఒక రజస్వలైన దానికింత కృత్రిమ శాస్త్ర మంటగట్టుట బాధించుటగాక వేరొండేమగును. చక్కగా గమనించి అష్టమ బలమునే ప్రధానముగా తీసుకొనుము.

శ్రీ:- స్వామి రాత్రియందైనను దోషమున్నాడు 9 శ్లోకమున

గు:- వత్సా రాత్రి బలముగల గ్రహములు శనిపాలితులగు శని, శుక్ర, బుధ, రాహు గ్రహములు - రాత్రి శనిపాలితులకు క్షేమమే యగును. గురుపాలితులగు గురు, కుజ, రవి, చంద్ర, కేతువులు పగటి బలము గలవారు. గాన ఆ లగ్నము ననుసరించి బలాబలములుండును. అయినను అష్టమ బలమె బలమని గ్రహించు.

శ్రీ:- స్వామి 10వ శ్లోకములో అడుగవచ్చినవారు నిలుచు కొన్న దిశలనుబట్టి వస్త్ర నిర్ణయము, పుత్ర నిర్ణయముచేయమంటు బిందువుల చెప్పినాడు. దీనినేమందురు

గు:- నాయనా ఇది ఒక అయోమయశాస్త్ర మనవలయును. జోస్యమునుండి ప్రశ్న శాస్త్రమని సృష్టించిన డబ్బులో కాలిడినాడు, ఇది

వృధాశ్లోకము. వస్త్రనిర్ణయము చేయవలయునని లగ్నచతుర్ధము వస్త్ర స్థానము దానిని ఏగ్రహముచూచునో ఏగ్రహముండునో ఆ గ్రహము యొక్క రంగు వస్త్రముండును. ఏగ్రహవీక్షణలేని లగ్నమైన ఆలగ్నాధిపతి రంగువస్త్రముండును- పాపగ్రహమై బలముగానుండిన ఆ రంగులో జీర్ణవస్త్రముండును. ఆఖరుపాదములలో తృతీయమున నొక గ్రహముండిన చతుర్ధమున గ్రహవీక్షణలేకున్న ఆతృతీయముననున్న గ్రహము రంగు చూపును గాని పృచ్ఛకుడు నిలుచుకొన్న దిశలవల్ల రంగులు మంచి చెడ్డలు తేలవని యెరుంగుము- ఇక సంతతియన్ననో పంచమము చంద్రుని పంచమాధిపతిని కటకమును (పంచమమును) గమనించవలయును. చంద్రుడు శుభుడై కటకము శుభస్థితినొంది (అనగా కటకములో శుభగ్రహముండుటో చూచుటో) పంచమాధిపతి శుభస్థానములందుండిన మంచిసంతతి గలుగును. ఇవి లోపించినను పంచమమును శుభులు చూచిన గ్రహమునుబట్టి సంతతి గలుగును. అనగా లగ్నాధిపతి ఉండినా చూచిన దేహబలము రూపము గలిగి సుగుణవంతులగు సంతతియు. పంచమాధిపతియుండినా చూచినా విద్యావంతులు భాగ్యాధిపతి చూచిన భాగ్యవంతులు గలుగుదురు- పాపులు చూచిన రోగగ్రస్తులు, కోపగ్రస్తులు, నేరగ్రస్తులు జనింతురు- సంతతితో దుఃఖించు యోగముగల జాతకులకు పిల్లలులేక దుఃఖమో ఉండి అప్రయోజకులై, అనామికులై పోవుటచే దుఃఖమో తప్పకకలుగును- విపరీత ఫలప్రదాః అన్న వాక్యము ననుసరించి దుఃఖింపచేయుటకు అకాలసంతతి గలుగును- సాకుటకు శక్తికి మితిమీరి కలుగుదురు. వండినన్నంబుతినితేపు వారెగాని వంట్లకెట్లని వగచెడివారులేరు అనిన విధముగా పిల్లలు తేలుదురు- కాలసంతతిలో 3, 5, 7 యేండ్లకు ఒకరు వంతున కలుగుదురు- వీరికి పంచమమున శుభగ్రహవీక్షనుండును- మధ్యమ సంతతి రెండుయేండ్లకు ఒకరువంతున కలుగు

చుందురు. వీరికి శుభాశుభగ్రిహవీక్షణగాని చంద్రికుజయుల పాప త్వమువల్లగాని కలుగుదురు— అకాలసంతతి సంవత్సరము లోపలగాని (8 నెలలకు లోపలగాని కలుగుచు తల్లిదండ్రిలకు బాధాకరముగా నుందురు. ఇట్లు గలుగుటకు కారణము విపరీతఫలము-చంద్రిడు కట కము పంచమము చెడినవారికి గలిగిన ఇట్టి విపరీతఫలము గలుగును- అప్రయోజక సంతతియగును. కాయకష్టముతో జీవించువారగుదురు. గురు చంద్రిలు శుభులై యుండి పంచమమును చూచిన 15 వరకు సంత తిని గలిగింతురు. మంచియోగజాతకులుగా నుందురు. (పుత్రకారకుడు గురువు సస్యకారకుడు, వీర్యకారకుడు చంద్రిడు గాఁబట్టి ప్రబలయో గము) పాపులై చూచిన సంతతి లేకపోవుటో ఉండి బాధించుటో గలు గును. ప్రతిదానిలో పాపగ్రిహములు విపరీతమును గలిగించుచుందురు. సూర్యచంద్రిలు 1 నుండి 7 వరకు, 7 నుండి 10 వరకు సంతతిని గలి గింతురు. బలాబలముల గమనింపవలయును. (గ్రహముయొక్క ఆరో హణ, అవరోహణములను పరికించవలయును) కుజుడు 1 నుండి 4 వరకు, 4 నుండి 7 వరకు, 7 నుండి 8 వరకు గలిగించును. బుధ శుక్రిలు 1 గెట్టుదాటిన 7 వరకు గలిగింతురు- గురువు 1 నుండి 5 వరకు, 5 నుండి 7 వరకు, 7 నుండి 9 వరకు గలిగించును, శని 1 నుండి 3 వరకు, 3 నుండి 7 వరకు, 7 నుండి 10 వరకు గలిగించును. ఇందులో బలాబలముల చక్కగా గమనించవలయును. కటకము చం ద్రిడు సస్యాధిపతులుగాన ఇతరగ్రిహములకు వీటిపైచూపుగలిగిన దండిగా సంతతి గలిగింతురు కటకము చంద్రిడులోపడకుండిన సంతతి కలుగబోదు- గ్రిహము చూచుట ఉండుట ద్వాదశాంశలలో పంచమాంశకు లోపలనే యుండుట బలము గాన తనపూర్ణ సంఖ్యవరకు సంతతి నిచ్చును- బలము తగ్గిన తక్కువగానుండును- శుభుల వీక్షణ సత్సంతతిని పాపుల చూపు దుస్సంతతిని గలిగింతురు- ఇందులో వంశ

వృక్ష బలమొకటిగలదు. అదికూడ గమనించవలసియుండును. చంద్రుడు శుభుడై బలవంతుడుగా యుండిన కటకములో లగ్నపంచమాధిపతు లుండి, పదియవయింట పాపగ్రహములేకున్న వంశవృక్షము దండిగా నుండును. వంశవృక్షమగు పదియవయింట పాపగ్రహమున్న వంశ వృక్షబలము తగ్గించును. అట్లుకాదని సంతతి పెరిగిన నశించును— శాస్త్ర జ్ఞులు చెప్పినట్లు దిక్కులనుండి వృక్కుకురావని యెరుంగుము. ఇక బిందువులనిన అడుగరానివి, చెప్పరానివని తలంచి విడుపుము—

శ్రీ:- స్వామి రంగుల నిర్ణయము దిక్కులనుండియే చెప్పెను నిజమే సందుర—

గు;- ముందు చెప్పితినిగదా. సూర్యునకు గోదుమరంగు చంద్రునకు శుద్ధతెలుపు, కుజునకు ఎఱుపు, బుధునికి చిలుకపచ్చ, గురు నకు పసుపుపచ్చ, శుక్రునకు ముతకతెలుపు, శనికి నలుపు రాహువుకు ధూమ్రవర్ణము (పొగరంగు) కేతువుకు చిత్రవర్ణము (చీట) ఇది జాత కులందరికి వర్తించును. వివాహసమయములలోకూడ ఈరంగులే యుం డును. గ్రహసమ్మేళన గలిగిన వెనుకనున్నగ్రహము వర్ణముండును.

శ్రీ;- స్వామి రంగువస్త్రములలో నలుపు, ఎఱుపు, చిత్ర వర్ణములలో రజస్వలైన నాశనము, రోగము, దారిద్ర్యమువచ్చు నన్నాడు. దీనినేమందురు-

గు - నాయనా శని, కుజ, రవి, రాహుకేతువుల పాపులని వారి లగ్నముల వారముల రంగుల మొదలయినవి దూరముచేసి అన్నారు. గురు శనిపాలితుల నెరింగి ఏ పాలకులకారంగు శ్రేయమని తలంచు— ఈశ్లోకమునందు చెప్పినవన్ని బూటకములని వదలుము-

శ్రీ:- స్వామి భార్యాభర్తల రాసికి ఎనిమిదింట చంద్రుడుం డగా గర్భాదానము ముహూర్తముంచరాదన్నారు. తామేమనెదరు-

## -: గర్భాదానము :-

గు:- వత్సా చంద్రుడు ఏలగ్నమునకు శుభుడు దేనికి అశుభుడన్నది తెలియక పలికినపలుకిది. మీన మేష కటక తుల వృశ్చికము లకు శుభుడు ప్రబలయోగప్రదుడు వుండవచ్చును. శేషించిన లగ్నములకు పనికిరాదు- ఈగర్భాదానము ముహూర్తమునకు పంచమము తప్పక శుభస్కరముగా నుండవలయును- ఎందుకనగా మంచి సంతతి కలుగవలయుననియు, యోగ్యులుగా పుట్టవలయుననియు గర్భకోశము ఏవిపత్తులపాలుగాకుండ, ఉండవలయుననియు, వంశవృక్షము చక్కగా నుండవలయుననియుగదా కోరిక అప్పుడు పంచమము శుభముగా నుండవలయును- పంచమములో నుండినా చూచిన విద్యావంతులు భాగ్యాధిపతి పంచమములోఉండినా చూచినా భాగ్యవంతులు లగ్నాధిపతి పంచమములో ఉండినా చూచినా రూపవంతులు, దేహదారుఢ్యము గలవారు సంతతి గలుగుదురు గాన పంచమమును ముందు చూడవలయును- అటుపై అష్టమ స్థానమున శుభులు ఉండడమో చూడడమో రెండవది- జీవితాంతము ఇరువురకు సురతసుఖము చక్కగా జరుగవలయుననియు ఆయురారోగ్యములు గలుగవలయుననియు ఈరెండు స్థానములు గాక సప్తమమున నొక శుభగ్రిహముండిన అన్యోన్యత జీవితాంతము సంసారసౌఖ్యము, ఆహారవిహారములు, కామభోగములు, కళత్రిసందము, గలుగవలయునను ఆశయము. ఇది ముహూర్తముగా నెరుంగుము- చంద్రుడు సస్యకారకుడు, వీర్యకారకుడు, సుఖకారకుడు గాబట్టి చంద్రుడు శుభుడు గాకుండిన శుభగ్రిహమైన చూడవలయును- పున్నమ అమావాస్య శ్రాద్ధదినము అర్ధరాత్రి వధూవరులు అనారోగ్యములో నున్నప్పుడు వర్జించుట శ్రేయము- గురువులో చంద్రుడు కలిసియున్నప్పుడు కటకములో శుభగ్రహమున్నప్పుడు ముహూర్తముంచిన వెంటనే

సంతతిగలుగును. శనిపాలిత జాతకులకైన శనిమూడింటిచూపు పదింటి చూపు చంద్రునిపై యుండునట్లు చూడవలయును. లేదా శని బుధ శుక్రులుగల రాశిలో చంద్రుడు ముందుండునట్లు చూడవలయును—వత్సా ఇట్టి ముహూర్తములు ఎన్ని ఏర్పాటు మనము చేసినను జనన కాల లగ్నమెట్లుండునో అట్లు జరుగుట తప్పదు అయినను మానవ ప్రయత్నము చేయవలయును. 12, 13 శ్లోకములందుగల నియమముల లెక్కింపక పైవిధముగా చూచుకొనుము.

## :- శీమంతము -:

శ్రీ:- స్వామి శీమంతము పంచమాష్టమ ద్వాదశమములందు సూర్యాంగారక శని రాహు కేతు క్షీణచంద్రులు లేకుండగా 4, 6, 8 మాసములలో చేయవచ్చునన్నారు క్రమబద్ధమేనందుర.

గు:- వత్సా శీమంతము దేనికొరకు చేయుచున్నారు అను విషయము గమనించక చెప్పినమాట లిందుగలవు. శీమంతముచేయుట ఎందుకనగా గర్భమునకు పాపగ్రహములవల్ల ఏవిపత్తులుగలుగకుండు నట్లు పురుషుడే పుట్టవలయు పితృకుటుంబమునకు సైదోడుగానుండవల యుననియు, వంశోద్ధారకుడుగా నుండవలయునని, సకల సద్గుణగరిష్ఠ డుగా నుండవలయుననియు సుఖప్రసవము గావలయుననియు, తల్లి పిల్లక్షేమముగా నుండవలయునని, నవగ్రహశాంతిహోమము మొదలు కొని కులాచారబద్ధతులెన్నియో చేయుచున్నారు. పై నుదహరించినవి శుభస్థితినొందవలయుననిన పంచమమును శుభగ్రహములు చూడవల యును. ధనమున్నవారికి పంచమాధిపతి చూచునట్లును. విద్యావంశముగా నున్నవారికి భాగ్యస్థానాధిపతి చూచునట్లును రూపహీనులకు లగ్నాధి పతి పంచమమును చూచునట్లును చేయవలయును. లేని దానిని అభి వృద్ధియగునట్లు ముహూర్తముంచవలయునుగాని అష్టమ ద్వాదశము

లతో పనిలేదు. నవమశుద్ధి అంతకు పనిలేదుఇకవారస్న రవి కుజ శని రాహు కేతు క్షీణ చంద్ర పాపగ్రహములంటివా- గురుశనివారి తములలో శుభులైనయడల పనికి వత్తురు. పాపులైనచో పనికిరారని విడువుము- వారు శుభులుగా నియమించిన గురు శుక్ర పూర్ణచంద్ర శుద్ధబుధులను లగ్నముద్వారా త్రిషడష్టాయరిశ్చ్వా విపరీత ఫలప్రదాః అన్న శ్లోకవచన ప్రకారముగా విడువవలయునేగాని శుభులని తలపకుము- ఈపునాదివల్లనే శాస్త్రము నాశనమైనదని యెరుంగుము- ఇక నెలలందమా 4, 6. 8 అని చెప్పెనుగదా ఆరు ఎనిమిదినెలలు ప్రసవ సమీపములు చేసి ప్రయోజనములేదు- గర్భనిశ్చయము బాగాతెలిసిన తోడనే 3, 4 మాసములకు లోపలనే చేయవలయును. సరియని చేసి యని తలంపనక్కరలేదు. బేసికి సరికి ప్రాణవాయువేదని యెరుంగు. గర్భము శుభస్కరమగుటకు చేయునది గర్భప్రథమమునందే వుంచవల యునుగాని ప్రసవసమయములలో చేసి ప్రయోజనములేదు. 7 మాస ములో 8 మాసములో ప్రసవమై బ్రతికినవారున్నారు గాన 3, 4 మాస ములలో చేయుట ఆహారవిహారములలో నియమము వహించుట గృహమునందున్నవారు దయాదాక్షిణ్యములతో చూచుట ఘోరగ్ర స్తను కోపగ్రస్తనుచేయక సంగమాదులందు యుక్తాయుక్తముగా సరించు చుట దైవప్రార్థనలు తప్పకచేయుట సీమంతమునకు లక్షణములుగాని శాస్త్రజ్ఞులు చెప్పినవిగావని యెరుంగుము. పుంసవనమునకు కూడా ఇదే విధముగా ముహూర్తము చూచుకొనుము-

## అక్షరాభ్యాస - విద్యాభ్యాసములు

శ్రీ:- స్వామి అక్షరాభ్యాసమునకు అష్టమమున ఏగ్రహము ఉండకూడదన్నాడు. అయిదవసంవత్సరమున చేయవలయునన్నాడు, ఇక తిథి వార నక్షత్రయోగకరణ లగ్నములగోల ఉండనే ఉన్నది.

ఇందులో అయసములకూడ చెప్పినాడు. ఇది సరియేనందుర.

గు:- వత్సా అక్షరాభ్యాసమన్నను, విద్యారంభమన్ననుఒకటే యనవచ్చును. బ్రాహ్మణుల ఇండ్లలోఉన్నతోద్యోగుల ఇండ్లలో ధని కుల ఇండ్లలో తలిదండ్రులు చదువుకున్న ఇండ్లలో అక్షరాభ్యాసమునకు ముందే దైవధ్యాన శ్లోకములు, పద్యములు, పాటలు నేర్పుచుందురు. అక్షరముల పలికించు చుందురు. వీటికి మంచి ముహూర్తములు లేవు. తల్లి ఆనాడే భాషాభ్యాసము చేసినది. లిపిని నేర్చుకొనుటకు అయి దవయేడు క్షేమమన్నారు. దీనిని ఎల్లరు వప్పుకొనవలసినదే భాష ఎట్లు అభ్యాసమగుచువచ్చునో అట్లనే అక్షరాభ్యాసమగుచువచ్చుట శ్రేయమే ఆముహూర్తమెచ్చోటయున్నదనుటయే గమనింపవలసివచ్చును.

వత్సా విద్యాస్థానము చతుర్థమని పంచమమని ఆగ్రంథము చది వినవారట్లు ఈగ్రంథము చదివినవారిట్లు వాగ్వాదముల చేసుకొనుచునే వున్నారు. పంచమకోణమని కొందరే గమనించిరి. అక్షరాభ్యాసమునకు గాని విద్యాభ్యాసమునకుగాని పాఠశాలలకు పంపుటకుగాని హైస్కూలుకు కాలేజి మొదలగు ఉన్నతవిద్యలకు పంపుటకుగాని సంగీతసాహిత్యముల నేర్పించుటకుగాని, శిల్పకళలందు ప్రవేశింపచేయుటకుగాని పంచమశుద్ధి యుండవలయును- అనగా లగ్నపంచమ భాగ్యస్థానాధిపతులు పంచ మమున ఉండడమో, చూడడమో ఉండి పంచమాధిపతికి పాపగ్రహ వీక్షణ లేకుండవలయును, లగ్నము గురుపాలితమో శనిపాలితమో యెరింగి వారము యేర్పరచుకొని చంద్రుని శుభగ్రహము చూచు నట్లు చూడవలయును. లేదా కటకమునైనను శుభులు చూడవలయును చంద్రుడు శుభులచే చూడబడిన ఆ దిననక్షత్రమేదైనను శుభమేయ గునని యెరుంగుము. ఆలగ్నమునకు చంద్రుడే శుభుడైన శుభులు చూడకనే ఆ నక్షత్రము శుభఫలమే యొసంగునని తెలుసుకొనుము. అష్టమమున పాపగ్రహము లేనిది శుభమేయగును- శుభగ్రహమున్న

మరింత మేలేయగుననని తలంచుము. ఈఅష్టమముతో పనిలేదు. ఇవ వారు చెప్పిన నియమములన్నియు ఉండపనిలేదు. అక్షరాభ్యాస, విద్యాభ్యాసములకు పంచమమే ముఖ్యమని యెరుంగుము. 38, 39 శ్లోకార్థములన్నియు వ్యర్థములని తెలుసుకొనుము. లగ్న పంచమమునను శుభులుగలవారిని పంచమాధిపతి శుభుడుగా నుండినవారిని చూడుము- విద్యాబలము, జ్ఞానము, సమయస్ఫూర్తి జ్ఞానము పాండిత్యబలము ఎట్లుం డునో జాతకములో. ఇట్లుండిన ఎట్టి లగ్నము నియమించినను జాతకుని విద్య ప్రబలముగానే వుండును—

## -ఉత్పాత గ్రహణ కాలములు-

శ్రీ:- స్వామి భూకంపము ధూమకేతువు (తోకచుక్క) మొదలగునుత్పాతములును సూర్యచంద్ర గ్రహణములు గలిగినని అనంతర మందేడు వాసరముల పర్యంతము శుభకర్మలు చేయరాదని యు, ఏనక్షత్రమందీచెప్పిన భూకంపనాద్యుత్పాతములు గలుగుచున్నవో ఆనక్షత్రమునందు ఆరునెలల పర్యంతము వివాహాదిశుభకర్మలు అయోగ్యమనియు ఇక గ్రహణ విషయమై అనేకము చెప్పుచు పూర్ణ గ్రహణ నక్షత్రము 6 మాసములవరకు అర్ధగ్రహణమైన 3 మాసముల వరకు శుభకర్మలకు యోగ్యముకాదని చెప్పినాడు. దీనినేమనవలయును.

గు:- వత్సా ఉత్పాతములు గలిగెడిది తెలిసియుండిన తెలిపెడి వారుండిన 3, 4 దినములు ముందు వదలుట క్షేమము- ఆగ్రహముల కలయికకు ముందు 3, 4 దినముల నుండి ఉత్పాతముల అలజడిగలుగు చుండును గాన వదలుట క్షేమము. గురు, శని, సమసప్తకములవల్ల కలయికలవల్ల శని కుజుల కలయికలవల్ల సమసప్తకములవల్ల శని రవి కలయికలవల్ల సమసప్తకములవల్ల నాలుగైదు ఆరు యేడుగ్రహముల సమ్మేళనమువల్ల ఉత్పాతములు గలుగుచుండును అజాతకునకు శుభగ్రి

హాములేవో అవి సమ్మేళనలో వెనుకనుండిన శుభఫలమే యిచ్చును. ముందుండిన దుష్ఫలమగును. గురు శనులు ఏకనక్షత్రమున ఏకపాదములో వున్నప్పుడు ఏజాతకునకైనను మంచిదిగాదు. శని ముందైన గురుజాతకునకు గురువు ముందైన శని జాతకునకు చేయవచ్చును. సమసప్తకములో ఇట్లే ఎవరి కిరణములు ఎవరిపైబడునో గమనించవలయును. కుజ శనులు, రవి శనులు ఇంతేనని యెరుంగుము. ఈ కలయికలు తప్పిన వెనుకనే శుభకార్యములు చేయుట క్షేమము. వీరు ఒకరికొకరు సరిపోని గ్రహములు. వీరి కలయికలు సమసప్తకములు. లోకభయంకరములు అల్లకల్లోలముల, అలజడుల గలిగించుచుందురు-మేష, వృశ్చిక, కటక, సింహములలో కలయికలు సమసప్తకములు జరిగిన యుద్ధములు తప్పక వచ్చును. ప్రజాక్షయమగును. ప్రభుత్వమునకు ప్రజలకు బద్ధద్వేషములు గలుగును. అట్టి సమయములు వదలుట క్షేమము- ఇక గ్రహణములంటివా గ్రహణమునకు ముందొక నక్షత్రము, వెనుకొక నక్షత్రము విడచినచాలును ఆదోషము పోవును. ఇందులో జాతకానుగుణ్యముగా శుభాశుభములు గలవు. సమసప్తకములలో అశుభములు తప్పక కలుగును. సమసప్తకములు కలయికలు గ్రహసమ్మేళనములు దాటినదనుక వదలుట క్షేమము- నక్షత్రముపై గ్రహము లేకుండిన నిర్జీవమనివారు తెలియక వ్రాసిరి. ఆ లగ్నమునకు చంద్రుడు శుభుడో అశుభుడో యెరుగరైరి. ఆ నక్షత్రమును శుభాశుభులు చూచుచున్నది గమనింపరైరి. ఒకేసారి ఆరుమాసములు గ్రహణము వచ్చు దినమునకు ముందు 3, 4 దినములనుండి దుష్ఫలములు గలుగును గాని గ్రహణము విడిపోయిన వెనుక దుష్ఫలములు లేవు. విడిపోయిన దినము విడిచి ఏశుభకార్యమైనను చేయవచ్చును,

గురు శని సమసప్తకములందు శని గురువులు ప్రక్కకు వైతొలగినంతవరకు శుభకార్యములుగాని దేవతాప్రతిష్టలుగాని చేసినఅశుభములు

తప్పవు. జననకాలమునందు సమసప్తకమున్నవారు శ్రమపడుచున్నారు దశానుకూలత గలిగినవారు సుఖపడుచున్నారు దశానుకూలతలేనివారు దుఃఖపడుచున్నారు. దశానుకూలత అనగా గురుపాలితులకు శనిదశ పోవుట, శనిపాలితులకు గురుదశపోవుట— గురువు శనిని 5, 9 యింట చూచినప్పుడు విష్ణుపర్యాయ దేవ, దేవీ ప్రతిష్టలు శని గురువును 4, 10 యింట చూచినప్పుడు శివపర్యాయ దేవ దేవీ ప్రతిష్ఠలు శ్రేయస్కరము శని గురు సమసప్తకములో చేసిన ప్రతిష్ఠలు వివాహాది శుభకార్యములు యజ్ఞయాగాది క్రతువులు గృహములు శంఖుస్థాపనలు అప్రతిష్టపాలై గాడిదలు పొరలాడుట నిశ్చయము- ఆరుమాసములు విడువ వలయునని ఈలోపల ఆ నక్షత్రముపైకి లగ్న పంచమ భాగ్యస్థానా ధిపతులు వచ్చిన అశుభముపోదా చంద్రుడే శుభుడైన నక్షత్రము శుభత్వము పొందదా. ఇట్టి ఆలోచనలు వీరుచేయక అన్నారని తెలియు చున్నది. నీవు వీరి ననుసరింపక ముందడుగు నిర్భయుడవై వేయుము-

## -క్షౌరమునకు యోగ్యకాలములు-

శ్రీ:- స్వామి క్షౌరమునకు తిధి వార నక్షత్రయోగముల చెప్పుచు కటక కన్యా కుంభ ధనుర్మాసములయందు చేయించుకొన రాదన్నారు.

గు;- వత్సా వారముల మాత్రము గమనించుము అజాతకుడు గురు శనిపాలితములలో ఎవరో తెలుసుకొని శనిపాలితుడైన శని శుక్ర బుధవారములు గురుపాలితుడైన ఆది సోమ మంగళ గురువారములు క్షురకర్మకు క్షేమముగా యెరుంగుము. నక్షత్రయోగములతో పనిలేదు. ఇక గ్రహబలము గావలయుననిన ప్రభుత్వోద్యోగులకు బొత్తిగా కుద రదు. ప్రజలకుకూడా చిక్కులుగా నుండును- మంగళవారమనిన ఎవరు

చేయించుకొననిరీతిగా చేసినారు. గురుజాతకులకు శ్రేష్ఠమని తెలిసికొనుము- ఇక కటక కన్యా కుంభ ధనుర్ మాసములు నాలుగులో శ్రావణ ఆశ్వీజ పుష్య మాఘమాసములు వచ్చును. ఇందులో చాతుర్మాసములు, శ్రావణ శనివారములు ఉపాకర్మలు దేవీనవరాత్రులు మొదలగునవి వచ్చును. అప్పుడు దీక్ష వహింతురు- పుష్యమాసము (ధనుర్ మాసము) విష్ణుపరముగా భజనలు, ధ్యానములు, పూజలు చేయుచు దీక్ష వహింతురు. మాఘమాసము (కుంభము) శివపర్యాయముగా మాఘస్నానములు, భజనలు, ద్యానములు, పూజలు మహాన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకములు చేయుచు చేయించుచు దీక్ష వహింతురు— అందువల్ల పనికిరాదన్నారు అవి లేనివారికి వారములే పాటింపవలయును క్షౌరము చేయించుకొనవచ్చును ఇందులో శుభాశుభములులేవు శ్రాద్ధదినములలో భోజనానంతరము పండుగదినములలో వ్రతదినములకో సాయంత్రమందు రాత్రియందు బంధుకర్మదినములలో చేయించుకొనరాదు. భార్య గర్భవతియని తెలిసినది మొదలుకొని కొందరు ఆరుమాసముల నుండి కొందరు దీక్ష చేయుదురు. దీక్ష అనగా గడ్డము గోర్లు పెంచి ఇలువేల్పునో ఇష్టదైవమునో ఉదయ సాయంత్రముల ధ్యానించుచు పూజించుచు సుఖప్రసవము గావలయునని పుత్రుడే పుట్టవలయునని ఆయురారోగ్య భాగ్యవంతుడుగా నుండవలయునని దీక్ష వహింతురు. దీక్షతో పనిలేనివారు చేయించుకొందురు. దీక్ష వహించుట శ్రేయమనియే భావింపుము.

## - నూతన వధూ, గృహ ప్రవేశము -

శ్రీ;- స్వామి వివాహమైన 6 వ దినము మొదలు 16 వ దినము వరకు సమదినముల యందు తిథి వార నక్షత్రయోగకరణముల చూడక నూతన వధువు గృహప్రవేశము చేయవచ్చునన్నారు శాస్త్రజ్ఞులు తామేమందురు-

గు:- వత్సా వివాహమేలగ్నమున అయినదో ఆలగ్నమునకు గాని ఆలగ్నమునకు పంచమ భాగ్యస్థానములకుగాని చతుర్థశుద్ధి గలిగిన లగ్నములో మధ్యాహ్నమునకు లోపల లగ్నమైన దినము నుండి 16 దినములకు లోపలగాని అవతలగాని గృహప్రవేశము చేయుంచుట శ్రేయము- చతుర్థము గృహముగాన గృహప్రవేశ లగ్నమునకు చతుర్థశుద్ధి తప్పక ఉండవలయును— దీనిపై రెండవది సప్తమశుద్ధి ఉండుట మంచిది. సప్తమము సంసారముగాన సప్తమశుద్ధి శ్రేయ మొసంగును. సరిదినమని బేసిదినమని తలంప పనిలేదు— ఇక చంద్రుని కూడ శుభులు చూచిన మరింత మేలు.

శ్రీ:- చతుర్థశుద్ధి యనగానేమి స్వామి

గు - నాయనా చతుర్థము, గృహములు, గృహోపకరణములు, ధాన్యసంపద, పశుసంపద, వాహనములు, భూములు, వస్త్రభూషణాలంకారములు. బంధుమిత్రులు, పరివారము, దాసదాసీజనములు బావులు, వనములు, మొదలగు స్థిరసంపద చతుర్థము శుభగ్రహము న్నను చూచినను ఒకటికి పదియై పదికినూరై పెంపొందును, పాపగ్రహమున్న నశింపుచేయును— గాన వధువును లగ్న చతుర్థ శుద్ధియందే గృహప్రవేశము చేయించవలయును. 16 దినములకు లోపల అనరాదు. ఇది ముఖ్యమైన విషయము గాబట్టి చతుర్థశుద్ధి గలిగినప్పుడే గృహప్రవేశము చేయించవలయును. వధూవరుల జాతకములో చతుర్థశుద్ధిలేకున్నను గృహప్రవేశములోనైన జోస్యుడు నియమించవలయు నెలకు లోపలని 3, 5, 7, 9, 11 నెలలకు లోపలని బేసి కొరకు చూడక చతుర్థశుద్దిని చూచి గృహప్రవేశము చేయించవలయును- వధువుకు ఆయింటికి ఏ రంగువస్త్రములు ఏ వారము శుభమోగమ నించుటకూడ మంచిది- గృహప్రవేశమైనదే ఆ యింటి ఇలువేల్పు

ముందు పూలు పంష్లుపెట్టి నమస్కరించి అటుపై అత్తమామలకు అటుపై భర్తకు నమస్కరించి తదుపరి పెద్దవారికందరికి నమస్కరించుట క్షేమము-

శ్రీ:- స్వామి వధువు అత్తవారింటికి చేరు సమయమునకు లగ్నము మంచిది వచ్చుటయము లేకున్న అప్పుడేమి చేయవలయును.

గు:- సాయనా ఉదయము వచ్చు లగ్నములలో వీలుగా కున్న సాయంత్రము 4-30 నిమిషముల నుండి శుభలగ్నమున్న ప్రవేసింపవచ్చును- అస్తమయములో రాత్రి ప్రవేసింపరాదు. ఆ గ్రామమున విడిదింటినిలచి అక్కడనుండి తిరిగి ప్రయాణమై శుభలగ్నమున ప్రవేశము గావచ్చును- ఆ యింట ఏ యశుభము జరిగినా ఈ మహాతల్లి ఏనాడు మాయింట కాలుపెట్టినదో ఆనాటినుండి అన్ని అశుభములే జరుగుచున్నవని వధువును ఆడిపోసుకొందురు. దీనిని ఏ మహానీయుడు సృష్టించెనోగాని ఆడవారికి ప్రాణహానియైనది- ఋణానుబంధరూపేణ పశుపత్నిసుతాలయ అన్నవచనము మరుపు తగిలినది- వరుని జాతక రీత్యా చతుర్థశుద్ధిలేనివానికి చతుర్థశుద్ధిలేని ఇల్లాలే దొరుకును. సప్తమ శుద్ధిలేనివానికి అట్టిదే దొరుకును. ధానిని ఆనరు బుద్ధిహీనులై ఏమి జరిగినా కన్యకల దూషింతురు. ఇది ప్రజల బుద్ధియందు స్థిరపడిపోయినది. ఇది సామాన్యముగా వదలదు ఇంటికి ఇల్లాలు వచ్చినా గాటికి ఎద్దువచ్చినా పశువువచ్చినా దొంతికి కుండవచ్చినా అదృష్ట దురదృష్టములు ఉండునన్నారు యజమాని అదృష్ట దురదృష్టములపై ఆదారపడియుండునని తలంపరు చెప్పరు- ఇది చాలా పొరపాటు- వరుని జాతకములో సప్తమమున నవమాధిపతి యుండిన భాగ్యవతిగా సుగుణవతిగా ఇల్లాలు వచ్చును- చతుర్థము నందున్న సర్వసంపదలు చేకూర్చును. ఇది జన్మతో వచ్చినదిగాని మధ్యలో వచ్చునదిగాదు. కావున

ముందు చెప్పువారరుదు- ఆనాడు గుణములు సరిపోయినవి బాగున్న దనినవారే మళ్లీ అందురు. గృహప్రవేశముతో చతుర్ధశుద్ధి చూడక పాపగ్రహమున్నప్పుడు ప్రవేసింపచేసిన వెంటనే అశుభములు గలుగును. వధువు దూషణల పాలగును. చతుర్థశుద్ధిని సంపూర్ణముగ పాటించుట క్షేమము.

## -: నిషేక ముహూర్తము :-

శ్రీ:- స్వామి నిషేక ముహూర్తమునకు అన్నిటకు చెప్పినట్లు తిథి వార నక్షత్రయోగముల చెప్పుచు మాసములలో ఆషాఢ భాద్రపద ఆశ్వీజ పుష్య మాసముల వదలినాడు. కటక కన్య కుంభ ధనస్సులు పనికిరావని ఒకచోటచెప్పి ఇక్కడ శ్రావణ మాఘములు పనికివచ్చునన్నాడు- శ్రావణ మాఘములలో కటక కుంభములు వచ్చునుగదా.

గు:- వత్సా వీటినన్నిట వదలి ముఖ్యముగా గమనించవలసినది. పంచమమునకు శుభగ్రహములు వచ్చుట, చూచుట అష్టమమున శుభులుండుట, చూచుట చూడవలయును. పంచమము సత్సంతతిస్థానము అష్టమము సురతసుఖస్థానము గాన అచ్చోట శుభగ్రహములుండవలయును- ఇక వరుని యింట దీక్ష వహించు వారుండిన శ్రావణ శనివారములు పౌర్ణిమ భాద్రపదమందు మాళాయములు అశ్వీజమున నవరాత్రిలు కార్తీక సోమవారములు వదలవలయును- పుష్య మాఘములలో దీక్ష చేయని వారైన చేయవచ్చును. పుష్య గురువారములు మాఘ ఆదివారములు పండుగలు పున్నమ అమావాస్యలు శ్రాద్ధదినములు ఆ జాతకులకు సరిపోని వారములు మౌఢ్యములు, లగ్నాధిపతి అస్తంగతుడైనప్పుడు వదలి పంచమ సప్త మాష్టమములు చంద్రుడు

శుభస్థితిలో నున్నప్పుడు ఎప్పుడైనా చేయవచ్చునని యెరుంగుదుము-

శ్రీ:- స్వామి కటక కన్యా ధను: కుంభ మీనములు పనికి వచ్చును మిగతా లగ్నములు పనికిరావన్నాడు. శని గృహమగు కుంభము నిక్కడ తీసుకున్నా వెందుకు-

గు:- నాయనా గ్రంధకర్తలకు శాస్త్రధోరణి ఒకటేగలదు. వ్యావహారిక లోకములేదని నిశ్చయముగా తెలుచున్నది. శాస్త్రమునకు వ్యావహారికమునకు సంబంధ బాంధవ్యములున్నవని గ్రహించక వారి యిష్టమొచ్చినట్లు నడచినారు. ఏది శుభముగా నుండవలయునో దానిని వారుగమనించలేదు. సురతసౌఖ్యము వధూవరు లెల్లప్పుడు అనుభవించుటకు సత్సంతతి గలుగుటకు మంచిదినము గావలయుననుకోరిక ఈ ముహూర్తములో నున్నది మరొకటిగాదు. వారు గురు శనిపాలితు లలో ఎవరోగమనించి నిషేదదినముల వదలి పంచమ సప్తమాష్టమశుద్ధి గల దినములలో చేయవచ్చునను ఆలోచనలేనివారని భావించు అన్ని లగ్నములు జాతకానుగుణ్యముగా యోగ్యములేనని భావించు. కుంభ మాసము మాఘములో వచ్చును. మాఘము యోగ్యమని కుంభము కాదనిన బాగుండదని ఇక్కడ దలంచినాడనుకొనుము- పంచమ సప్తమా ష్టమశుద్ధిగల ముహూర్తముండిన వివాహదినముననే చేయుట క్షేమము సంవత్సరము లోపల మూడుతలలు కాకూడదు. మూడవ నెలాఖరులో చూడవచ్చును లేదా అయిదవనెల ఉండనే వున్నదనువారు ఏమంతపాపి పోయినదనువారు కొందరు పదిమంది బంధువులలో నిషేకము చేయ కూడదు. పిల్ల సిగ్గు పడుతుందని కొందరు పదుగురి దృష్టి తగులునని కొందరు దానికి ప్రత్యేకదినము లుండవలయునని కొందరు ప్రత్యేక ముహూర్తముండిన చీరలు, రవికలు. సొమ్ములు పెండ్లికొడుకునకు ప్రత్యేకకట్నములు కుదురునని కొందరు ఇట్టి నీచమార్గములనవలంభించి

కొందరుండుదురు. ఇట్టి నీచ కోరికలవల్లనే స్త్రీలధికమగుచుండిరి. చెరుపకురా చెడియెదవను సామెత ప్రకారము కన్యక వారిని బాధించి తామట్టిబాధలపాలగున్నారు. వరుడు వరుని తలిదండ్రులు కన్య నిచ్చు వారి సొత్తు ఏమాత్రము దుఃఖింపచేసి ఇగుకునబెట్టి కోరినను తమకట్టి ఫలము తప్పదని యెరింగి ధర్మమునకు లోబడి వివాహ సమయము లోనే నిషేకము చేయుట మంచిది- వధూవరుల కోరికల నెరింగిన వారగుదురు. సద్రసోపేతభోజనము ముందుంచి పదినిమిషములు తాళు పెద్దవారు రాలేదన్నట్లుండును- గాన వెనుదీయ్యక చేయుట క్షేమము-

శ్రీః- స్వామి దంపతుల కన్యోన్య ప్రీతికర నక్షత్రముల చెప్పుచు రవి శుక్రులు లగ్నమునకు కుడిప్రక్కనైన నుండిన శుభను న్నాడు నిజమే నందుర.

గుః- వత్సా పూర్వ పాప పుణ్యములు గ్రహమండలములం దుండి ఈజన్మకు ప్రసారము చేయుచున్నవని మహనీయులు చెప్పు చుండిరి, అనుభవరీత్యా తేలుచున్నది. ఈ నక్షత్రములకు గ్రహములు లేక దిననక్షత్రమురాదుగదా- నక్షత్రములు అన్యోన్యత ఎట్లు గల్పించ గలవను సందేహము వారికి గలుగలేదు. గాన వారట్లు వ్రాసిరి. వీటిని లెక్కింపకుము- ఇక రవి శుక్రులందరూ రవి వెనుక నుండవలయునని ఉదయము పశ్చిమమునకు సాయంత్రము తూర్పునకుపోయిన సూర్యుడు వెనుకగును- కుడి కనిన ఉదయము ఉత్తరదిశకు ప్రయాణము చేసిన కుడిభాగమున నుండును- సాయంత్రము దక్షిణమునకు ప్రయాణము చేసిన రవి కుడిప్రక్కన నుండును- గాని శుక్రుడు మాత్రము అట్లు గాదు ఒకప్పుడు పశ్చిమమున ఒకప్పుడు తూర్పున పొడచుచుండును. పశ్చిమమున నున్నప్పుడు తూర్పునకు, దక్షిణమునకు ప్రయాణము చేసిన వెనుక కుడిప్రక్క వచ్చును. పశ్చిమమునకు ఉత్తరమునకు

పోవలయునన్న తూర్పున పొడిచినంతవరకు మానుకొనవలయును. ఇది సాధ్యముగాని పని- చుక్కెదురని సామెతలు కూడా పెట్టుకొన్నారు. శుక్రిస కెదురుగ ఎట్టి సమయములలోనైన పోరు. ఇది తమిళనాడులో ఎక్కువగా పాటింతురు ఆంధ్రిలో కొన్నిప్రాంతములలో నున్నది. కొన్ని ప్రాంతములలో లేదు. అచుక్కవక్కటే మానవుల బాధించు నపుడు శేషించినగ్రహములన్నీ ఏమిచేయును- ఊరకుండనా ఖగోళమున గ్రహములన్నీ ఉన్నవిగదా. అందులో శనిపాలితులకు శుక్రుడు మేలు చేయవలయునుగదా. గురుకుజులకు, బుధశనులకు అస్తంగతము ఉదయము గలదుగదా. వారికి లేనిదీ శుక్రునకే గలుగుటకు ఏమి కారణము అని విమర్శించిన వారిని గానము. శుక్రుని ఎదురంత బాధించిన శని ఎదురు బాధించదా బాధించను, వేధించను ఈగ్రహమునకే శక్తిగలదా— నాయనా ఇట్టి వింతపలుకు లీశాస్త్రమున అనేకము గలవు. వీటినన్నిటను విడచి ఏ ఏ ముహూర్తమునకు ఏ ఏ స్థానముల గ్రిహములుండవలయునో గమనించి ప్రజోపయుక్తదవుగమ్మ.

## -నూతన వస్త్రాభరణముల ధరించుటకు ముహూర్తము-

శ్రీ:- స్వామి అన్నిటకు చెప్పినట్లు తిథి వార నక్షత్రియోగముల చెప్పెను. వస్త్రాభరణములకు వీటికి సంబంధమున్నదందురా.

గు:- వత్సా సంబంధము లేదుగాని వారు నడచిన దారులట్లున్నవి— విను ఏలగ్నజాతకుడో తెలుసుకొని ఆ వారములందు వస్త్రభూషణములకు నెలవు చతుర్ధము. వస్త్రములకు కారకుడు చంద్రిడు ఆభరణములకు కారకుడు గురువు. వీరు శుభులై యుండుట మంచిది. అన్నిలగ్నములకు వీరు శుభులుగారు గాబట్టి చతుర్థమును లగ్నపంచమ భాగ్యస్థానాధిపతులు ఉండడము లేదా చూడడము మంచిది. వారిలగ్న

మునకు సరిపోవు రంగులనే వాడుట మంచిది. ప్రకృతము పండుగల నాడే వస్త్రముల కొనుట, ధరించుట ఎక్కువగాగలదు. ఆనాడు చతుర్థ శుద్ధిగలవారికి మంచివస్త్రములు సరిపోవురంగులు, సరియైనవెలకు దొరకును. చతుర్థమున పాపగ్రిహము గలవారికి బుద్ధికి నచ్చని వస్త్రములు సరిపోనిరంగులు ఎక్కువవెలకు దొరుకును. మిడతకండ్లుపడినవి దారలు గలవి చాలి చాలనివి సరీగ కుట్టనవి తటస్థించును. వస్త్రములు, ఆభరములు కొన్నవారు వాటి అంచులకు పసపు పట్టించి, పూలుపండ్లతో సహా దేవుని ఎదుట పెట్టి నమస్కరించి ధరించుట మంచిది- మరుజన్మకు కొదువలేని వస్త్రాభరణములుండును. గర్వోన్మత్తులైగాని నాస్తికులైగాని దేవునికి చూపక ధరించిన మరుజన్మకు వస్త్రాభరణహీనమగును- నాయనా నక్షత్రములను యోగములను సవరించునవి గ్రిహములుగాన వీటిని లెక్కింపక చతుర్థశుద్ధి చూడుము- చంద్రిడు శుభుడై చతుర్థశుద్ధి గలిన వస్త్రములకు- గురువు శుభుడై చతుర్థశుద్ధి గలిగిన ఆభరణములకు కొదువుండదని యెరుంగుము- చతుర్థశుద్ధి లేనివానికి ఎంతధనముండినను లభింపవు మలిన వస్త్రధారియై జీవింపవలసివచ్చును

## -: యాత్రిలకు పోవుటకు ముహూర్తము :-

శ్రీ;- స్వామి యాత్రిలకు పోవు జాతకునకు ఆయుర్దాయము ముందు చూడమన్నారెందుకు.

గు;- వత్సా పూర్వము రైళ్లు, విమానాలు, బస్సులు, బండ్లు రోడ్లు, పోష్టాపీసులు లేవు గాబట్టి కాలినడకను పోవలయును. మహారణ్యములలో ఘాతుక మృగములు, దొంగలు చలిజ్వరములు, కలరాస్ఫోటకములు, విషజ్వరములు మొదలగునవి విపత్తులనుండి వెలువడి యాత్రిల సేవించి తిరిగి ఇల్లు చేరిన దనుక పోయినవాని

శుభాశుభములు తెలియవు బాగున్నది లేనిది బ్రతికినది వచ్చినది తెలియని కాలమది గాబట్టి మొదట ఆయుర్దాయమును చూడమన్నారు ఆయువుండినగదా తిరిగివచ్చుట—

శ్రీ;- స్వామి యాత్రాప్రయాణమును గురించి 56. 57, 58 59 శ్లోకము వరకు చెప్పిన విషయములు యాత్రాప్రయాణ సంబంధములుగావని ఇష్టమొచ్చినట్లు తెలిపినారని తెలియుచున్నది. వీటి ననుసరింపమందుర.

గు;- వత్సా గురుపాలిత జాతకులకు గురువు- శనిపాలిత జాతకులకు శని- నవమస్థానము చూచినప్పుడు యాత్రాప్రయాణములు చేయింతురు. వివాహములు, ఉపనయనము, పుట్టువెంట్రుకలు, దైవ ధ్యానములు, దేవాలయమునకు పోయి దేవుని దర్శించి తీర్థప్రసాదములు గైగొనుట గల్పింతురు— శుభకార్యములలో పాల్గొనుట ధనము నిల్వ చేయుట గలిగింతురు- నామకరణముల చేయింతురు- వస్త్రభూషణముల కొనుగోలు చేయింతురు. అనేక శుభకార్యములలో పాల్గొనచేతురు- ఒకానొకప్పుడు గురుపాలిత గృహనవమస్థానముల శని చూచినను శని పాలిత గృహ నవమస్థానముల గురుడుచూచినను విపరీతఫలము క్రింద చేయించుచుందురు. అట్లు పాపగ్రహములు శుభకార్యముల చేయించినప్పుడు కొన్ని విపత్తుల గల్పించుచుందురు. వారి వారి గృహముల నవమస్థానములవారు చూచుచున్నప్పుడు చతుర్థమున నొక శుభగ్రహముండుటో చూచుటో గలిగినప్పుడు ప్రయాణము చేసినవారికి ఏలాటి చిక్కులు గలుగవు. యాత్రలు ముగించుకొని తన స్వక్షేత్రము తాను చేరుకొనును. చతుర్థమున నొక పాపగ్రహముండినను చూచినను అక్కడ అనేకచిక్కులకులోనై కష్టములతో స్వగృహము చేరవలసియుండును-పుట్టుకతో యాత్రాఫలములేనివారికి ప్రయాణబలములేనివారికి గోచారరీత్యా బలము గలిగిపోయినను అక్కడ కొన్ని చిక్కులకు

లోనుగాక తప్పదు. పుట్టుకతో నుండిన బలమే బలము- ఏప్రయాణము చేసినను చతుర్థశుద్ధి ముఖ్యము. చతుర్థశుద్ధి లేకున్న ఆటంకము లనే కము గలుగుచుండును. వారు చెప్పినవన్నీ నిరర్థకములుగా భావించి విడువుము.

## -: ప్రియాణ లగ్నములు :-

శ్రీ;- స్వామి ప్రయాణములు ఎన్నిటికో ఎన్నివిధములనో వున్నవిగదా- అన్నిటకు లగ్నము లగ్నమన్నారుగాని స్థానము చెప్ప లేదు. తిధి వార నక్షత్రియోగముల వారశూలల నక్షత్రిశూలల మొద లగునవి అనేకము చెప్పుచు అనేకవిధములగు చిక్కుల గల్పించి విసి గించినారు. ఇవన్ని చూచుకొని మానవుడు ప్రయాణము చేయవలయు ననిన అలవియగునా.

గు;- ఔను ఎన్ని చిక్కులు కావలయునో అన్నీ గల్పించి కూడ అసలు మార్గమును గమనించి చెప్పలేక పోయినారు. స్వస్థలము నుండి మానవుడు ప్రయాణము చేయుటకు కారణముండును. ఊరక పోవడుగదా అది ఎట్టిదో దానికి కారకుడెవడో తనకు శుభగ్రిహము లెవ్వియో గమనించక అనేకముగ తిరగట్లుపెట్టినారు. గమ్యస్థానము చేరలేకపోయినారు- ఇది ఒకశాస్త్రమై నిలచి లోకులకు నమ్మకము చెరచినది తిరిగి నమ్మకము గలుగవలయుననిన మహాకష్టమగును— వినుము—- ప్రియాణము చేయుటకు చతుర్థమును పాపగ్రిహమో శుభ గ్రిహమో చూడవలయును. అంతవరకు మానవుడు గృహము విడు వడు—విడుచునపుడు ఏదోవక కార్యముండునుగదా-అదేదో తెలుసుకొన వలయును. ఎట్లనగా అయ్యా నేనొక కన్యకను చూడడమునకు పోవు చున్నాను మంచిదినమెపుడో చూడమందురనుకొందము- అప్పుడు లగ్న

మేదో గమనించి ఆ లగ్నమునకు చతుర్థము ప్రయాణము. అచ్చోట శుభులున్నను చూచినను బస్సులు, రైళ్ళు లుండ్లు సేవకులు సమయమునకు దొరికి అనుకున్నస్థలము చేరి అక్కడ తమకు కావలసినవారితో కలుసుకొనును- పాపగ్రహము చతుర్థమున నున్నను చూచినను చిక్కులనేకము కలుగును. వాహనములు సమయమునకు దొరుకవు. కావలసిన వారుండరు, అన్ని ఆటంకములే గలుగును, కన్య విషయము గాబట్టి కన్యకు కారకుడు శుక్రుడు గాన శుక్రుని ఒకశుభగ్రహముచూచిన కన్యక విషయము కుదురును- పాపగ్రహము శుక్రునిచూచిన సాకుచెప్పుదురు కాదనుటో చూడమనుటోతప్పదు- ఈముహూర్తమునకు చతుర్థశుద్ధికన్నా లగ్న పంచమ భాగ్యస్థానాధిపతులు శుక్రుని చూచుట ముఖ్యము- ఇదేలగ్నముతో చూడతగినవి- బస్సులు, లారీలు, టాక్టర్లు, సైకిళ్లు. విడిపశువులు, బండ్లు పశువులదొడ్లు, పశుగ్రాసము వేయు స్థలములు, మరుగుదొడ్లు మొదలగునవి కొనుగోలుకు ఇట్లుండవలయును- శుక్రుడే శుభుడైన లగ్నములకు శుక్రుని శుభులు చూడనక్కరలేదు. చతుర్థము శుభస్థితిగా నుండిన చాలును. ఇట్లన్ని ప్రయాణములకు కారకుల స్థలముల చూడవలయునని యెరుంగుము-

శ్రీ:- స్వామి విడిపశువులన్నా రెందుకు-

గు:- వత్సా పశువులలో విడిపశువులనిన కట్టుటకు ఈనుటకు మధ్యలో వుండబడినవి. వీటికి శుక్రుడు కారకుడు చూలుతో నున్నవి ఈనినవి పాలిచ్చుచున్నవి పాలుతాగు దూడలకు చంద్రుడు కారకుడు కోడెలకు కుజుడు కారకుడు- పిడుగుకొట్టిన వాటికి ముసలి వాటికి గురువు కారకుడు- కొన్ని ఈతల పశువులకు ముసలివాటికి శని కారకుడు- కౌమారదశలోనున్న ఎద్దులకు సూర్యుడు కారకుడు. గంగిరెద్దులకు వడిపాయిపు ఎద్దులకు బుధుడు కారకుడు- గాన చతుర్థమును ఏ

గ్రహము చూచునో అట్టివి దొరుకును అట్టివేవుండును- శుభులుచూచిన శుభముగా నుండును— పాపులు చూచిన కష్టనష్టములు గలుగుచుండును. పొడుచుట, కరచుట, తన్నుట, పండుకొనుట, దొంగతనము నేర్చుకొనుట, సచ్చుపడుట, ఎముకలు, గుడ్డలు, వెంట్రుకలు మొదలగునవి తినరానివి తినుట, వెళ్లిపోవుట, హఠాత్మరణములకు లోనగుట సంభవించును- అప్పటిలో నడ్డివి, పొట్టికాళ్లవి, తోకపోయినవి, మందగుదెవి, పొట్టమూతివి, వొట్టకొమ్ములవి, వెల తక్కువయి పెట్టుకొనిన కొంతనయముగా నుండును. ఇందులో రంగులుకూడ పనిచేయును. గురుజాతకునకు నల్లటివి, శనిజాతకునకు ఎఱ్ఱటివిగలిగిన నష్టపడుదురు. వారి వారి రంగులు వారి కుండుట క్షేమము— ఎద్దులలో కోడెలకు పోవునపుడడిగిన కుజుని శుభులు చూడవలయును లేదా కుజుడు శుభుడుగా నుండవలయును- విడిపశువులకు ఆవులకు పోవునపుడు శుక్రుని శుభులు చూడవలయును లేదా శుక్రుడు శుభుడుగా నుండవలయును. పాడిపశువులకు పోవునపుడడిగిన చంద్రుని శుభులు చూడవలయును లేదా చంద్రుడు శుభుడుగా నుండవలయును- పిడుగు కొట్టిన ఎద్దులకు పోవునపుడు అడిగిన గురువును శుభులు చూడవలయును లేదా గురువు శుభుడుగా నుండవలయును. కౌమారదశ దాటి ఈతల ఎనుములకు పోవునపుడడిగిన శనిని, శుభులు చూడవలయును లేదా శని శుభుడుగా నుండవలయును. అర్ధప్రాయపు ఎద్దులకు పోవునపుడడిగిన సూర్యుని శుభులు చూడవలయును లేదా సూర్యుడు శుభుడుగా నుండవలయును పట్టుకవచ్చి తిరిగి అమ్ముకొని లాభము గడించుకొనువారికి బుధుని శుభులు చూడవలయును లేదా బుధుడు శుభుడుగా నుండవలయును- చతుర్ధము పశుస్థానము గాబట్టి చతుర్ధశుద్ధి గలుగవలయును- చతుర్థమును ఏ గ్రహము చూచునో ఆ వయస్సు, ఆ రంగు, ఆ నడకగల పశువులు ఆ యింట నుండును- వారికి దొరుకును.

ప్ర:- స్వామి కాడిపెడ్డులలో ఒకటి బాగు ఒకటి వోగుగా నుండును. ఒక ఎనుము బాగపాలిచ్చును. మరొకటి ఇవ్వదు కారణమే మందురు.

గు:- వత్సా పాపగ్రహ శుభగ్రహములు చతుర్థము నందున్నప్పుడు అట్లుండును- గురుకుజ రవి చంద్ర కేతుగ్రహములు శుభులుగా నుండిన కుడిభాగముసగల ఎద్దును పశువును పోషింతురు. అశుభులుగా నుండిన కుడిభాగమును నశింపుచేతురు- శని బుధ శుక్ర రాహులుండిన ఎడమభాగమును పోషింతురు. పాపులుగా నుండిన ఎడమభాగమునగల వాటిని నశింపుచేతురు. శుక్రుడు శుక్రక్షేత్రములగు వృషభతులలు శుభస్థితి నొందియున్న ఆవులకు, స్త్రీలకు, వాహనములకు, శుక్రకారకత్వములకు బలముగా నుండును. శని శుభుడై మకర కుంభములు శుభస్థితి నొందియున్న ఎనుములు, దున్నపోతులు, విధవలు, శనికారకత్వములకు బలముగా నుండును- చంద్రుడు శుభుడై కటకము శుభస్థితి నొందియున్న పాడి అభివృద్ధిగా నుండును. దూడలు బాగ బ్రతుకును, పశువృద్ధియగును, ధనధాన్యములు, నీరు, బహుసంతతి, సుఖము- స్త్రీలు మొదలగు చంద్ర కారకత్వము లభివృద్ధిగా నుండును. పాడికి పంచమము చంద్రుడు బలముగా నుండవలయునని యెరుంగుము. చంద్రుడు బలముగా నుండినను చతుర్థమును చూచినను సంపూర్ణమగు తెలుపు గలిగి కొమ్ములు గిట్టలు మూతి ఎఱువు గలిగి తోకపొడవు, తెల్లటి వెంట్రుకలు గలిగి చూడచక్కని ఎద్దులుండును. (దీనిని రైతులు బాపన పశిదందురు) గుణ్ణము లుండును. అవికూడ మంచివిగా తెలుపువన్నెతో బుద్ధిబలముగలవిగా నుండును- పాపియైయుండినా చూచినా దీనికి విరుద్ధమైన నష్టము కష్టము సంపాప్తింపచేయును- కుజుడు శుభుడై బలిష్టుడై చతుర్థమున నుండినా చూచినా పందెపుకోడెలుండును. భూభాగము మేరమీరి ఉండును ఉన్న

కోడెలు పరాక్రమము గలిగి కీర్తి దెచ్చును. పాపిగా నుండిన వాటితో ధనవ్యయమై అపకీర్తి దెచ్చును. పశువృద్ధికి చతుర్థము శుక్రుడు శుభముగా నుండవలయును. అట్టిచోట స్త్రీలు రూపవతులుగా నుందురు- మానవులకున్నట్లు పశువులకుకూడ బాల్య యౌవన కౌమార వృద్ధాప్య దశలు గలవు. పురుష జంతువులకు బాల్యమున చంద్రుడు యౌవనమున కుజుడు కౌమారమున సూర్యుడు వృద్ధాప్యమున గురువు పోషించును- ఇంటి యజమాని యోగమే పశువులకు వచ్చును స్త్రీ పశువులకు బాల్యమున చంద్రుడు, యౌవనమున శుక్రుడు, కౌమారమున బుధుడు, వృద్ధాప్యమున శని పోషించును- ఇంటివారికి ఏ గ్రహము బాగుండునో ఆ పశువు బాగుండును. యజమానికి ఏదశ యోగించునో ఆదశ పశువులకు యోగించునని యెరుంగుము-

## స్త్రీలు నూతన వస్త్రములు ధరించి అత్తవారింటికి పోవుటకు ముహూర్తము

శ్రీ;- స్వామి స్త్రీలు వడిబాలు కట్టుకొని అత్తవారింటికి పోవుటకు ముహూర్తమెట్లుండవలయునందురు-

గు;- వత్సా ప్రయాణము లన్నిటకు చతుర్థశుద్ధి యుండవలయును. అక్కడ అత్తవారింటిలో కాలుపెట్టు సమయమునకు లగ్నచతుర్థము శుభగ్రహములు చూడవలయును. అత్తవారింటికి తనభర్తకు సరిపోవు రంగువస్త్రముల ధరించి గృహప్రవేశము చేయవలయును. ఇల్లు విడుచునపుడు చతుర్థశుద్ధి లేకున్నను గృహప్రవేశము చేయు సమయమునకు చతుర్థశుద్ధి బాగుండవలయును. అట్టి ముహూర్థము ముందు చూచుకొని పిలుచుకవచ్చుట క్షేమము. నూతన గృహప్రవేశమునకున్న విధులన్నీ యుండుట క్షేమము. వారశూలలు చుక్కెదురు

సూర్యుడెదురు రాహుకాలము మంగళ శుక్రవారములు అష్టమీనవ మములు మొదలగునవి. ఇందులో ఈశుభములో నశించిపోయి శుభఫ లమే యొసంగును. దేనిని లెక్కింపక చతుర్థశుద్ధిని చూడుము.

శ్రీ:- స్వామి మంగళ శుక్రవారములలో స్త్రీలను ప్రయా ణము చేయించరే కారణ మేమందురు.

గు;- వత్సా మంగళవారమునకు సర్వమంగళవారమని (మం గళగౌరీవారమని) పార్వతి పేరు నియమించి శుక్రవారము లక్ష్మీవారమని నియమించిరి. త్రిదేవులలో జ్ఞానాధిష్ఠానదేవతయగు సరస్వతికి వారమే మరచిరి. గౌరీ లక్ష్మీవారములని పుట్టినింటినుండి ఆడబిడ్డలు పోయిన లక్ష్మీపార్వతులు పోయినట్లని శాస్త్రము నియమించిరి. ఇది ఏ నాటుపుట్టి నదో ఎవరికి తెలియదు. ఈకాల వాహినిలో అప్పుడప్పుడు ఇట్టి విపరీత ములు గలుగుచుండును- మంగళవారము కుజుని వారము. కుజుడు (విష్ణుపరము, శుక్రుడు శివునిపరము) పురుషగ్రహము గౌరీపూజకు మంచిదన్నారు- ఇది ఎట్లో వారికే తెలియును కుజగ్రహము శుభు డుగానున్న ప్రయాణము చేయవచ్చును- శుక్రవారము లక్ష్మీవారము గాదు పార్వతివారము శుక్రుడు శుభుడైన శుక్రవారము ప్రయాణము చేయవచ్చును- సోమవారము లక్ష్మీ సరస్వతులవారము- సోమవా రము అమ్మాయి అత్తవారింట చతుర్థశుద్ధిలో నూతనవస్త్రముల ధరించు కొని వడిబాలుతో పూలు పండ్లు పసుపుకుంకుమతో గృహములో ప్రవేశించి దేవునికి నమస్కరించిన లక్ష్మీ సరస్వతులు తాండవింతురని జ్యోతిశ్శాస్త్రము చెప్పును- ఈ శుక్ర మంగళవారముల కాశక్తి లేదు. సోమవారము ప్రశస్తమైనది. శుక్ర మంగళవారములలో పోవచ్చును- అత్తవారింటికిస్త్రీ మంచిగా పోవలయునుగాని చెడ్డగాపోరాదు, మంచి రోజు పంపవలయును వారియిండ్లకువచ్చు కోడండ్రను అట్టిరోజులలోనే

రమ్మనవలయును- శుక్రవారము పోయిన మాయింటి అదృష్టముపోవు ననుట మంచిదిగాదు. శుక్ర సోమవారములే అత్తవారిల్లు చేరవలయును ఆ యమయిల్లు బంగారుమయము గావలయునను కోరిక తల్లిదండ్రుల కుండును. గాబట్టి పైరెండు వారములే స్త్రీలు అత్తవారింట ప్రవేశింప వలయును. సోమవారము లక్ష్మి సరస్వతులకు, శుక్రవారము పార్వతికి ముఖ్యమని యెరుంగుము-

## - యుద్ధ ముహూర్తము -

శ్రీ:- స్వామి రాజులు యుద్ధమునకు పోవుటకు అనేక విధముల ముహూర్తముల వ్రాసిరి. ఇవి అన్నీ సరేనందుర-

గు:- వత్సా వారు నియమించిన ముహూర్తములు అర్థము లేనివి, ఆచరణాయోగ్యముగానివి వారిని విమర్శించి ప్రయోజనములేదు గ్రంథ విస్తరమగును, విను- సైన్యబలము (చతురంగబలములు) గలుగుటకు వసతులు గలుగుటకు వైనము దొరుకుటకు శత్రుసైన్య వ్యూహములలో దొరుకకుండుటకు వీరు పన్నిన వ్యూహములలో శత్రు సైన్యము దొరుకుటకు, సైన్యము పరాక్రమముగా ముందు నడచుటకు శత్రుపట్టణముల ముట్టడించుటకు శత్రుసైన్యవ్యూహముల భేదించుటకు శత్రువుల పలాయనము చేయుటకు, విపత్తులనుండి తప్పి శత్రువుల విపత్తుల పాలుచేయుటకు చతుర్థస్థానము బాగుండవలయును- శత్రువులు పలాయనమగుటకు శత్రునిశ్శేషమగుటకు రోగబాధలు గలుగకుండుటకు, విపత్తులు తటస్థింపకుండుటకు, ప్రకృతి వాతావరణము చక్కగా నుండుటకు, శత్రువుల భీభచ్ఛపరుచుటకు షట్స్థానమున నొక శుభగ్రహ ముండవలయును. శత్రువుల నశింపుచేయుటకు చావక చంపుటకు పరాక్రమముతో పోరాడుటకు, వైనము దొరుకుటకు

జయముగా యుద్ధము సాగిపోవుటకు, తలచుకొన్న తలపులు పండుటకు సైన్యనాయకులకు సైన్యమునకు ఉత్సాహము, దీర్ఘాయువు, పరాక్రమము గలుగుటకు అష్టమమున నొకశుభగ్రహముండవలయును- పరాజయము పొందక ఎక్కువసైన్యము నష్టముగాక శత్రుబలము పటాపంచలుచేసి జయజయధ్వనులతో స్వక్షేత్రము చేరుటకు పదింట నొక శుభగ్రహముండవలయును- చతుర్థమునగాని, దశమమునగాని బలవత్తరముగా నొకగ్రహముండినచాలును- ద్వితీయమునగాని ఎనిమిదింటగాని నొకగ్రహముండిన చాలును- కడకు ద్వితీయాష్టమములలో నొక శుభగ్రహముండవలయును. చతుర్థదశమములలో నొకశుభగ్రహముండవలయును- ఇట్లు ముహూర్తము చూడవలయును. ఇట్లు జాతకమున్నవారికి అపజయము గలుగబోదు. అన్ని రంగములలో జయమే గలుగును- ఇందులో స్త్రీ గ్రహములుగాక పురుషగ్రహములు శుభగ్రహములై ఆయాస్థానములలో నుండిన మరింత శుభము. చతుర్థదశమములలో షష్టాష్టమములలో శుభగ్రహములు లేనివారు యుద్ధము గల్పించుకొనిన నష్టకష్టములు పొందుదురు, రాజుకు ముఖ్యమంత్రికి సైన్యాధిపతికి ఇట్టి శుభలక్షణములు లేకుండినవారు సంధితో జీవించుట క్షేమము— పందెములకు, కోడిపందెములకు, గుఱ్ఱముపందెము మొదలగు పందెములకు ఇట్లుండవలయును—

శ్రీ:- స్వామి దైవబలము చేకూరవలయునన్న ఎట్లుండవలయునందురు,

గు:- వత్సా నవమస్థానాధిపతి దశమమునగాని చతుర్థమునగాని యుండిన మానవ సహాయముగాక దైవసహాయము సంపూర్ణముగనున్నట్లేనని భావించు లేక లగ్నపంచమాధిపతులుండిన మధ్యమమని యెరుంగుము- నవమాధిపతి ఏకాదశమమునందున్న దుర్లాభము సంపూర్ణముగ నుండును.

శ్రీ:- స్వామి విమానబలమని, నావికాబలమని, టాంకుల బలమని సైన్యబలమని నాలుగు విధములుగా ప్రకృతమున్నవిగదా. వీటికి ఏ ఏ గ్రహబలముండవలయునో తెలుపుడు.

గు:- వత్సా విమానబలమునకు, నావికాబలమునకు చంద్రు డధిపతి. చంద్రుడు కటకము శుభస్థితిలో నుండిన అనగా చంద్రుడే శుభుడై యుండుటో లేక కటక చంద్రుల శుభులు చూడడమో గలిగిన విమాన నావికాబలము శత్రువుల జయించును. ఆకాశమార్గమున సముద్రమున శత్రువుల పటాపంచలుచేసి ఎదురులేక సంచరించును. కుజుడు కుజక్షేత్రములగు మేష వృశ్చికములు శుభస్థితి నొందిన కాల్బలము, పరాక్రమముతో శత్రువ్యూహముల భేదించి ముందుకు నడచిపోవును. టాంకులబలము గావలయునన్న శుక్రుడు శుక్రక్షేత్రములగు వృషభ తులలు శుభస్థితి నొంది చతుర్థము బలముగా నుండిన టాంకులు బాగా పనిచేయునని యెరుంగుము.

శ్రీ:- స్వామి ఇతరులు సహాయము చేయుటకు ఏ స్థానము బలముగా నుండవలయునందురు-

గు:- వత్సా చతుర్థము బంధుమిత్ర స్థానముగదా. చతుర్థమున నొక శుభగ్రహమున్నను దశమము నుండి చూచినను బంధుమిత్ర సహాయముండును. ప్రజాదరణ ప్రబలముగా నుండును. కార్యసాధనౌను. సకల విధముల బలము సంప్రాప్తించును. అన్యప్రభుత్వముల ఆదరణ లభించునని యెరుంగుము— అన్యప్రభుత్వ బలమునకు, సూర్య చంద్ర కుజులుగాని, వారి గృహములుగాని, శుభులకు దొరికిన మరింత మంచిదని తెలుసుకొనుము-

శ్రీ:- స్వామి సూర్య చంద్ర కుజులుగాని, వారిగృహములు గాని శుభులకు దొరికిన అన్నారు అదెట్లు,

గు:- వత్సా (శనిపాలిత లగ్నములకు) మిథునమున శని ప్రకృతముండెనుగదా. సింహమున రవి చంద్రులున్నప్పుడు శని మూడింటచూచిన సింహ రవి చంద్రులబలము పూర్తి శని గ్రహించి నట్లుగదా- అట్లు గ్రహము స్థానమును ఏగ్రహముచూచినను ఆగ్రహ బలమును చూచిన గ్రహము హరించును. శుభాశుభములు ఇంతేనని గ్రహించు- ఒకరికొకరు ఎదురైన ఒకరిబలము ఒకరు నశింపుచేసు కొందురు- మిశ్రమఫల మేర్పడును. శుభులు బలవంతులై పాపులు దుర్బలులైయుండిన కొంతవరకు మేలుండును. పాపులు బలవంతులై శుభులు దుర్బలులైన మేలు కీడుగా మారునని యెరుంగుము.

శ్రీ:- స్వామి విత్తనములు చల్లుటకు విత్తులను బూడ్చుటకు దినశుద్ధి ఎట్లుండవలయునందురు-

గు:- వత్సా భూమి చతుర్థమని చెప్పితినిగదా- ఏజాతకునకు ఆలగ్న చతుర్థము బాగుండి చంద్రుడు శుభుడై యుండిన సస్యము చక్కగా వచ్చును, చీడ పురుగు మొదలగు రోగబాధలకు (తెగుళ్లు) లోనుగాక సస్యశ్యామలముగా దినదినప్రవర్ధమానముగా పైరువచ్చునని గ్రహించుకొనుము.

శ్రీ:- స్వామి కొన్నిలగ్నములకు చతుర్థశుద్ధి జాతకానుగుణ్య ముగ దొరుకదు. అప్పుడేమి చేయవలయును-

గు:- వత్సా ఆజాతకుడు ఏ పాలితుడో తెలుసుకొని చతుర్థ శుద్ధి ఏ సమయమునకు వచ్చునో గమనించి ఆ టయమునందు ప్రారం భించిన అటుపై ఎప్పుడైనా వేసుకొనవచ్చును. నక్షత్రములచూడ నక్కరలేదు. చంద్రుడు శుభుడైయుండిన చాలును, చంద్రుడు శుభు డుగాకున్న చంద్రుని శుభులైనను చూడవలయును. అట్లుగాకున్న దశ మమునునైన శుభులు చూడవలయును.

శ్రీ:- స్వామి దశమమునకు దీనికి సంబంధమేమిటి.

గు:- వత్సా దశమము జీవనము వృత్తిగదా దశమము చక్కగా నుండిన జీవనము చక్కగా నుండును. గాన కొంతవరకు మేలుగా నుండునని భావము.

## - వనముహూర్తము -

శ్రీ:- స్వామి వనము వేయుటకు గ్రహబలమెట్లుండవలయు నందురు-

గు:- వత్సా భూమికి చెట్లకు కుజుడధిపతి గాబట్టి చతుర్థము చక్కగా నుండి కుజుడు మేష వృశ్చికములు శుభస్థితిలో నుండిన ఆ వనము దినదినాభివృద్ధియై చాలాకాలము కాయుచుండును. పిందెలు రాలిపోక పిందె అయినదంతా నిలచి కాయలగును- (పిందెలకు కుజుడధిపతి) దీనికితోడు చంద్రుడు శుభుడైయుండిన పూతకధిపతి చంద్రుడు గావ పూసిన పూతంతయు రాలిపోక పిందెలగును- దీనికితోడు దశమ ఏకాదశములందొ నొకశుభగ్రహమున్న సమయమునకు ధర పెరుగును- చంద్రుడు శుభుడుగానున్న భావిలో నీరు దండిగా నుండును. రైతు లాభము గడించును. కుజుడు శుభుడై చతుర్థమునందున్నవానికి వనమునకు తగినభూమి గలుగును. వనము దినదినాభివృద్ధియగును. పిందె పడినదంతా కాయలగును. మంచిలాభము వచ్చును. కుజుడు పాపియైకూడ శనిపాలితజాతకులకు వనయోగముండును. ఎట్లనగా శని కుంభమున నుండ జననమైనవానికి మేష వృశ్చికముల శనిచూచును. మూడింట మేషమును, పదింట వృశ్చికమును చూచును. అప్పటిలో శని బుధ శుక్రులతో కలిసి కుజుడు ముందుండిన వారి వనము కల కలలాడుచుండును- గొప్పలాభము గడింతురు. అట్లగాక శనిపాలిత

జాతకులకు చతుర్థమున శని శుక్ర బుధ రాహువు లుండిన వనయోగ ముండును. గాని కుజుడు మేష వృశ్చికములు వారిచే చూడబడదేని వనము నిలువదు, కాయదు కడకు కొట్టివేయుట తప్పదు. చంద్రుడు కటకము శుభస్థితి చెందకపోయిన భావిలో నీళ్లుండవు. ఉండిన రుచి మారును. (జవుకు ఉప్పు చేదు) పూతపూయదు. పూసిన రాలిపోవును పండ్లు బాగుండవు తీపులేక రసములేక వరిటివుండును. కుజుడు పాపియై చతుర్థమున ఉన్నవారికి వనము వేసిన, వేసినచేతనే మధ్యలో కొట్టి వేయవలసివచ్చును. లేదా నెట్టైపోవును శంకుపోవును వేరుపురుగు కొట్టి చచ్చిపోవును కాయక పూయక పోవును- కాసిన కాయలకు పురుగు పట్టును. కడకు రైతును నష్టపెట్టును- చెట్టువేసి కొంతకాలము పోషించి కొట్టిన పాపము తప్పక తెచ్చి పెట్టును.

## -సంవత్సర ప్రారంభములో సేద్యమునకు పోవుటకు-

శ్రీ;- స్వామి సంవత్సర ప్రారంభములో సేద్యమునకు పోవుటకు ఏ లగ్నమున ఏ దిశకు పోయిన బాగుండునది తెలుపుడు-

గు:- వత్సా పోవుదినమునకు ముందే జోస్యుని వారడిగివుండ వలయును చతుర్థశుద్ధి దొరుకుట కష్టము. వారడిగిన టయమునకు గురు శనిపాలితములో ఏ లగ్నమగునో గమనించి దానికి చతుర్థశుద్ధి ఏదినము నకు ఏర్పడునో తెలుసుకొని చెప్పవలయును- చతుర్థశుద్ధియే దొరుకక పోయిన ఆ జాతకునకు లగ్న పంచమ భాగ్యస్థానాధిపతుల దిశలకు పొమ్మని చెప్పవలయును. ఆదిశలో వారికి భూమి లేకున్న ఉన్నదిశకు పోయి ఆ భూమిలో శుభగ్రహదిశకు మళ్లించి దున్నమని చెప్పవల యును- చతుర్థశుద్ధికై వేచియుండుట రైతుకు మంచిది, ఆ సంవత్స రము మంచిపంట వచ్చువారికి చతుర్థశుద్ధియు దిశయు దిశాధిపతి శుభ

స్థితిలో నుండును. కుజుడు కుజక్షేత్రములు శుభస్థితిజెందియుండిన తగిన సేద్యము తగినంత ఎరువు సమయమునకు నడచును, మంచిపంట వచ్చును. దీనినిబట్టి గోచారరీత్యాచూచి ఆరైతుకుపంట ఎంతమాత్రము వచ్చునది ఎంతమాత్రం మిగులునది జోస్యుడు చెప్పవచ్చును. గురు పాలితులకు గురువు, శనిపాలితులకు శని చతుర్ధమును ఏసంవత్సరమున చూచునో ఆ సంవత్సరము పైరుపంటలు దండిగా వచ్చును. గృహ ములో ధాన్యము సమృద్ధిగా నుండును. పాపగ్రహము చతుర్ధమును చూచిన సంవత్సరము పైరుపంటలు చక్కగా రావు. గురుశనులేగాక రవి కుజ శుక్ర బుధ రాహు కేతుగ్రహములు పంట వచ్చేడి సమయ మునకు చతుర్ధము నందున్న పైరుపంటలు చక్కగా రావు. జోస్యుడు గాని, పౌరోహితుడుగాని రైతుల ప్రశ్నలగ్నములగాని, జాతకముల గాని, స్థిరముగా తనవద్ద పెట్టుకొని యుండుట శ్రేయము. అట్లు వుండిన ప్రతిసంవత్సర ఫలము చెప్పిన చక్కగా జరుగును చెప్పినదంతా సరి పోయి పౌరోహితునిపై జ్యోతిష్యముపై గట్టి నమ్మకమేర్పడును- దానికి తగిన కీర్తి, ఆదాయము లుండును. ప్రజలకు మేలు చేసిన వాడగును.

## - సేద్యమునకు పోవునపుడుండవలసిన పద్ధతి -

శ్రీ:- స్వామి రైతు ప్రారంభ సేద్యమునకు పోవునపుడుండ వలసిన విధుల వివరింపుము.

గు:- వత్సా ఇంటి ఇలువేల్పు ముందట దీపము ముట్టించి పూజచేసి టెంకాయకొట్టి నైవేద్యముచేసి మంగళహారతి ఇచ్చి స్వామి ఈ సంవత్సరము మంచి పంట వచ్చునట్లు ఏఆటంకములు గలుగకుండు నట్లు పశుసంపద చక్కగా నుండునట్లు దయ చూడుమని ఇంటి అందరు

నమస్కరించి ఎద్దులకడిగి ఆహారము మంచిదిగా పెట్టి కాడికట్టి ఇంటియజమానురాలితో ఎద్దులకు నొసట కాళ్లకు కుంకుమబొట్టు పెట్టించి పూలు పెట్టి యజమాని రుమాల చుట్టుకొని బొట్టు పెట్టుకొని ఎద్దుల ముందు టెంకాయకొట్టి మంగళహారతియిచ్చి ఎద్దులకు ముందుగా ముత్తైదువును ఎదురు రమ్మని పోయి చతుర్థశుద్ధి లగ్నములో లగ్న పంచమ భాగ్య స్థానాధిపతుల దిశలకు సాగదోలుట క్షేమమని యెరుంగుము-

## - ఆకుతోట వేయుటకు దినశుద్ధి -

శ్రీ:- స్వామి ఆకుతోట వేయుటకు దినశుద్ధి ఎట్లుండవలయును. ఏ ఏ గ్రహబలముండవలయునందురు.

గు;- వత్సా అడిగిన టయమునకు లగ్నమేదో గమనించి గురుశనిపాలితముల తెలుసుకొని చతుర్థశుద్ధి చూచుకొని అటుపై కుజుని మేష వృశ్చికముల శుభస్థితి గమనింపవలయును. కుజ కుజక్షేత్రములు శుభస్థితిజెందిన భూమి శ్రేష్ఠమై మునగలు, అవిసెలు, వార్డీపి, ఆముదపుచెట్లు, తురకవేప మొదలగు చెట్లు, ఆతోట ఉన్నంతవరకు అభివృద్ధిగా నుండును. చంద్రుడు కటకము శుభస్థితిజెందిన చిగుళ్లు దినదినాభివృద్ధిగ పెరుగును- ఆకులు మంచివిగా వెలువడును. అరటి చెట్లు, పూలచెట్లు, పరేందిపచెట్లు, ఓషదులకు పనికివచ్చునవి విరివిగా నుండును- చతుర్థశుద్ధి గలిగిన తోట పిన్న పెద్ద ధర్మబుద్ధిగలవాడుగా నుండి అందరిని బాగస్తులచేత బట్టుకొని నడిపించగలవాడుగ నుండును తోటకు చుట్టునుండు సన్నకల్లి, ఎఱ్ఱిచెరుకు మొదలగునవి చక్కగా పెరుగుచు తోటకు కోటగోడవలె నుండును. కుజ మేష వృశ్చికములు పాపత్వముచెందిన చెట్లన్నియు తొందరగా పురుగుకొట్టి నశింపైపోవును (కుజాధిపత్యము గలవన్నియు కూలిపోవును) చంద్రుడు కటకముచెడిన

చిగుళ్ల ఆకులుగాక ముడుచుకపోవును- చంద్రాధిపత్యముగలవి నశిం పగును. చతుర్థశుద్ధిలేనితోట తొందరగా పాడగును, చతుర్ధమున శుభులై కుజచంద్రులున్నతోట బలిష్ఠముగా నుండును. శుక్రుడు తీగెలకధిపతి గాబట్టి శుభుడై యుండిన తీగెలు కోమలముగా పెరుగుచువచ్చునని యెరుంగుము-

## -గర్భవతులు తల్లిగారింటికి ఆస్పత్రికి పోవుటకు-

శ్రీ:- స్వామి గర్భవతులు తల్లిగారింటికిగాని ఆస్పత్రికిగాని పోవుటకు దినశుద్ధి ఎట్లుండవలయునందురు-

గు:- వత్సా గర్భస్థానము పంచమము గాబట్టి గర్భముతో పోవుచున్నది గాన పంచమమును శుభగ్రహము చూడవలయును- అట్లు పంచమమును శుభగ్రహము చూచిన ఆమె గర్భమున కేలాటి చిక్కులు గలుగవు. అటుపై చతుర్థశుద్ధి గలిగిన మరింత మంచిది. చతుర్థము ప్రయాణస్థానము గాబట్టి ప్రయాణములో ఏ చిద్రములులేక గమ్యస్థానము చక్కగా చేరుకొననగును.

## చంటిబిడ్డ నెత్తుకొని అత్తవారింటికి కోడలు వచ్చుటకు - దినశుద్ధి ఎట్లుండవలయును -

శ్రీ:- స్వామి చంటిబిడ్డ నెత్తుకొని అత్తవారింటికి కోడలు వచ్చుటకు శిశువు స్వగృహ ప్రవేశము చేయుటకు గ్రహబలము దిన శుద్ధి ఎట్లుండవలయును-

గు:- వత్సా చతుర్థ పంచమశుద్ధి యుండగా వారికి తగిన వార ములో లగ్న చతుర్థశుద్ధిలో గృహప్రవేశమైన తల్లికి పిల్లకు ఆయురా రోగ్యభాగ్యములు చేకూరును.

## -: వధూవరుల వివాహకాల సూచన :-

శ్రీ:- స్వామి ఒకజాతకునకు మంచి రూపవతిగా కన్య దొరుకును. మరొక జాతకునకు రూపహీన లభించును, కారణమేమందురు.

గు:- వత్సా రూపములో ముఖాలంకారమనియు, దేహసౌష్ఠవమనియు రెండు విధములు- చంద్రుడు శుభుడై బలవంతుడై యుండెనేని లగ్నద్వితీయమున శుభగ్రహముండెనేని ముఖాలంకారము బాగుండును. శుభగ్రహమై చంద్రుడుండిన మరింత అందముగా నుండును. చంద్రుడు ఉచ్ఛయందుండిన మహానందముగా నుండును. అష్టమ, సప్తమ లగ్నములందుండినను అందము ఉట్టిపడునట్లుండును. చెవులు కంఠము, స్వరము చక్కగా నుండును. తగినట్లు జ్ఞానసంపద మృదువైన దేహము, తెల్లటిరంగుతో నుండును. ఆ చంద్రుడు పాపియై కటకమున పాపియుండిన చూచిన ముఖాలంకారము చెడును. దంతములు పొడవై చెక్కిళ్లగుంతలై ఫాలతలము కొంచమై ముక్కుచిన్నదై వికారముగా నుండును. గురులగ్నమై లగ్నమునకు కుజుడు లగ్నద్వితీయమున చంద్రుడుండిన ముఖమున చంద్రకళ తాండవించును అందగాడు, అందగత్తెయని పిలువబడును—

కుజుడు సూర్యుడు శుభులై కుజక్షేత్రములగు మేష వృశ్చికములు శుభస్థితిలో నుండి గురుపాలితజాతకుడైన పొట్టిగాక పొడవుగాక సమానమగు దేహమై ఎగుభుజములు, దీర్ఘమగుచేతులు, పొడవైన ముక్కు, బిఱ్ఱయిన కండరములు, నరముల పటుత్వము గలిగి చక్కని వాడుగా నుండును. చూడనందమైన ఎరుపురంగుతో గుంగురులు తిరిగిన వెంట్రుకలతో నుండును. బలశాలి ధైర్యవంతుడనిపించుకొనును. కొంతవరకు దేహసౌష్ఠవము కుదురును. యౌవన కౌమారదశలందు సౌఖ్యపడును.

కుజుడు పాపియై కుజక్షేత్రములలో పాపులుండుటగాని చూచుట గాని అయినచో పొట్టియగును. కురుచ చేతులు, కురుచకాళ్లు యేర్పడి మరుగుజ్జు రూప మేర్పడును. నరములలో దుర్బల మేర్పడును. రూప హీన మేర్పడును. నడ్డిముక్కు యేర్పడును. యౌవనకాలము వృధా యగును యౌవనము తగ్గును యౌవనములో యోగించదు.

సూర్యుడు సూర్యక్షేత్రమగు సింహము శుభస్థితిజెంది గురుపాలిత జాతకుడైనచో కన్నులు బహు అందముగా నుండును. చెడని దేహముగా నుండును. కౌమారదశ వచ్చినను యౌవనదశలో నున్నట్లుగానే వుండును. రాజఠీవి గలిగి, దీర్ఘములైన చేతులు, చక్కని దేహము, కంఠస్వరము వినసింపుగను మంచి ఎఱుపురంగు గలిగి యుండును. ధర్మహృదయుడుగా ప్రకాశించును.

అశుభుడైనచో గుంతకండ్లుగాగాని మిట్టకండ్లుగాగాని తయారై ముఖాలంకారము చెరచును. కౌమారదశలోనే వృద్ధునిగా మార్చును. పిదప దేహముగా మార్చును. రంగును మార్చును అలంకారము చెరచును కఠిన హృదయునిగా చేయును. కఠిన మనస్సునిగా త్రిప్పును. పాపమును వడిగట్టును.

బుధుడు శుభుడై బుధక్షేత్రములగు మిధున కన్యలు శుభస్థితి నొంది శని పాలితలగ్నమైనచో చక్కని వెన్నెముక చూడతగినట్లు పిరుదులు, ఊరువులు, డొక్కలు గలిగి వెనుకచూచిన అందముగా గానవచ్చును. ఎఱుపులో ఆకుపచ్చ మిశ్రమముగా గానవచ్చును. నడుము సన్నముగా నుండును, ఏ జబ్బుకు లొంగని అంగములుండును. నడుములో బలము బాగుగా నుండుదు.

పాపియైనచో వెన్నెముక వంగి గూనిగాని నడ్డిగాని వచ్చును. పిఱ్ఱలు చూడ వికారముగా వెనుకకు పెరుగును. నడుము బలిసి

వికారముగా నుండును. రంగు చెడిపోవుచు, పొట్టియగును. డొక్కలు నడుము, తొడలు ఒకేసదరముగా గానవచ్చును-

గురువు శుభుడై ధనుర్ మీనములు శుభస్కరమై గురుపాలిత జాతకుడైనచో వక్షస్థలము విశాలమై కండరములతో కూడి నరముల బిగువు గలిగి దేహచ్ఛాయ పసుపురంగుతో నుండును. విశాలఫాలతల మందును. అజానుబాహులుండును. చూచిన తోడనే పండితుడుగా గానవచ్చును. వందనీయుడుగా పూజనీయుడుగా గురుస్వరూపముగా గానవచ్చును.

గురువు ధనుర్ మీనములు అశుభస్థితినొందిన వక్షస్థలము సన్నమై ఉదరభాగము వక్షస్థలము ఒకటిగానే వుండును. రంగు మారిపోవును. చూచెడివారికి రూపహీనుడుగా గానవచ్చును. వక్షస్థలములో కండరము లుండవు పండితుడుగా గన్పడడు- శల్యావశిష్టుడుగా గానవచ్చును,

శుక్రుడు శుక్రక్షేత్రములగు వృషభతులలు శుభస్థితినొంది శని పాలితుడైనచో పొత్తి కడుపుభాగము చక్కగానుండి లింగము వృషణ ములు బలిష్టములై వృద్ధాప్యమునకూడ యౌవనము గలిగి వుండును- స్త్రీలకు రూపవంతుడుగా గానవచ్చును. లింగసంబంధమగు వ్యాధు లెవ్వీ అంటకుండును సంగీత కళలందు యోగ్యుడుగా గానవచ్చును కంఠస్వరము మాధుర్యముగా నుండును. చిరునవ్వాతని సొత్తుగా నుండును. సురతసుఖములో స్త్రీల మెప్పుబడయును.

అశుభుడుగా నుండిన పొత్తికడుపే లేక వంగిపోవుటో చూడ వికారముగా పెరుగుటో తప్పదు. లింగము, వృషణములు దుర్బలము లగును. అండవాయువు వచ్చుటో, అండములు లావై దిగజారుటో గలుగును. స్త్రీలు ద్వేషింతురు. పొత్తికడుపు లావై ముందుకువచ్చి సురతసుఖమనుభవించుటకు వీలుగాకుండ స్త్రీలకు అసహ్యకరముగా

నుండును. కడకు పురుషత్వము నశింపచేయును.

శని, శనిక్షేత్రములగు మకర కుంభములు శుభస్కారముగానుండి శనిపాలితజాతకుడైనచో- కడుపుభాగము ముందుకు వెనుకకుపోక దేహమునకు కావలసినంత చక్కగా నుండును. ఎముకలు బలిష్ఠముగా నుండును. కీళ్లలో లోపము లేకుండును- నలుపులో అలంకారముండును. పాదములు చక్కగా నుండును. ఆహారకోశము రాళ్లు తిన్నను జీర్ణము చేయు బలముండును.

శని అశుభుడై మకర కుంభములు అశుభమైయుండిన కడుపు లోపలికిపోయిగాని, చాలా ముందుకువచ్చిగాని చూచువారికి హాస్యాస్పదముగా నుంచును. ఎముకల బలముండదు. కీళ్లు దుర్బలముగా నుండును, దేహము పొడునలుపుగా నుండును. మోయరానంత కడుపై నడచుటకే కష్టముగా నుండును. జీర్ణశక్తి లేకుండును. అపానవాయువులు బలమగును. మలలజబ్బు తప్పదు.

రాహువు, స్వాతి, శతభిషం, ఆరుద్ర నక్షత్రములందుండి తుల, కుంభం, మిధున లగ్నమైన తల పెద్దదగును. చాలా పొడవుగా దేహముండును. ముఖములో అందముండదు. అంశ రాహువంశయైన మరింత పొడవుగా నుండును. ద్వికళత్రయోగము తప్పదు. అయినను ఈ లగ్నములైన కొంతవరకు మేలుగా నుండును, రాహువుకు సప్తమమున కేతువుండుటచేత ముఖము గురుపాలితులకు కొంత నయముగా నుండును. శనిపాలితులకు ముఖాలంకారము కేతువు చెరచును. గురుపాలితులకు సప్తమ రాహువు ముఖాలంకారము చెరచును.

గురుపాలిత లగ్నములైన తల కాళ్లు సన్నముగాగాని, లావుగాగాని వుండి పొడవుగా నుండును. ద్వికళత్రయోగము సృష్టించును. పాముకండ్లవలె కండ్లు సన్నగా నుండును.

కేతువు లగ్నాత్ వుండిన పొట్టిగా వక్షస్థలము విశాలమై తల పెద్దదై, వెంట్రుకలు విరియబోసుకొని యిచ్ఛగలిగినవాడుగా నుండును. అశ్వని, మఖ, మూల నక్షత్రములై గురుపాలిత లగ్నమైయుండిన చూచుటకు బాగుగనే కన్పడును. తత్వబోధకుడై శిష్యకోటిని సంపాదించును. మహాత్ముల చూపించువాడుగా నుండును.

శనిపాలిత లగ్నమైయుండిన పొట్టిగానుండి చూచుటకు యేహ్యముగా నుండును. చిన్నని తలయై వెంట్రుకలు విరియబోసుకొని భయంకరముగా నుండును.

శ్రీ: స్వామి కన్యకింటికి, వరునింటికి యజమానులు ఫలానా వారలుందురని చెప్పుచున్నారే ఏ ఏ గ్రహములవల్ల తెలుపనగునో తెలుపుడు.

గు: వత్సా! సూర్యుడు శుభుడై సప్తమమందుండిన తండ్రి యాజమాన్యమాయింటికుండును. శుభస్కారముగా వధూవరులకుండును సమయమునకు తండ్రిపరముగా వరుడుగాని కన్యగాని వుండును.

అశుభుడైయుండిన తండ్రి అమిత కోర్కెలతో వివాహామునకు అడ్డు తగులుతు యౌవనకాలము దాటించును. పినతండ్రి, పెద్దతండ్రివల్ల కూడా ఆటంకములు గలుగుచుండును. తూర్పుదిశన శుభుడైయుండిన కన్యను చూపించును.

తొమ్మిదవయింట నొక పాపగ్రహముండి సూర్యుడు సూర్య క్షేత్రము పాపత్వము చెందివుండిన తండ్రిలేని వివాహామగును. ఆ వివాహాము ఆటంకములతోనగును. నవమమున సప్తమమున అష్టమాధిపతివుండిన చావులతో నుండును. షట్స్థానాధిపతివుండిన రోగ బాధలతో నుండును. ద్వాదశాధిపతివుండిన ధనము దుర్వ్యయమగు ఏదోవకటి వ్యయము చేయును. 1, 2, 3 చోట్ల మాట్లాడుకొన్నవి

తప్పిపోవును. మూడవచోటనో నాల్గవచోటనో వివాహమగును.

చంద్రుడు సప్తమమున శుభుడైయుండిన తల్లిపరముగా వరుడు గాని కన్యగాని వుండును. తల్లిపరముగా కార్యమగును. తగు సమయమునకు వివాహమగును. లేదా వదిన, చిన్నమ్మ, పెద్దమ్మపరముగా యేర్పడుదురు. తల్లి ఆదిపత్యముక్రింద నడచును. ఆ యిల్లు తల్లి పాలనలో నుండును. తల్లి విజ్ఞానిగా నుండును. కన్య రూపసిగానుండును మంచి యౌవనకాలములో వివాహమగును. వాయువ్య మూలన వరునికి కన్య, కన్యకు వరుడు లభించును. కౌమారదశలో చక్కగా జరుగును. సుఖముగా నుండును. ముఖము అందముగా నుండును. కంఠస్వరము చక్కగా నుండును. నదీ, తటాక, సముద్రతీరములలో వివాహమగును.

చంద్రుడు పాపియైయుండినచో తల్లి విపరీతమైన కోర్కెలవల్ల వివాహము సకాలమునకు కాదు. ఆటంకపరచుచుండును. తల్లిపరముగా నున్న బంధుత్వమును విడుతురు. అశుభములతో ఒకటి రెండు సంబంధములు తప్పిపోవును. యౌవనకాలము దాటిపోవును. గర్భవతులకు సన్నపిల్లలకు పాడియనుములకు, సన్నదూడలకు తల్లికి గండముగా నుండును. ఈ అపశకునములతో పెండ్లి అగుచుండును. స్థూలదేహముగాగాని సన్నగాగాని వుండును. ముఖములో అందముండదు.

సప్తమములో శుభుడై కుజుడుండిన అక్కకూతురుండును. కన్యకు అక్కగాని అన్నగానివుండి వారి ఆధిపత్యముండును. యౌవనకాలమంతయు సర్వసౌఖ్యములు లభించును. దేహసౌష్ఠవము చక్కగా నుండును. వీర్యధాతువులు బలిష్ఠముగా నుండును కొండలు, వంకలు అడవులుగలచోట దక్షిణదిశన వివాహమగును అత్తగారింట గౌరవింతురు రాను పోను సౌకర్యముండును

సప్తమమున పాపియై కుజుడుండిన-అన్నగాని అక్కగానివుండి

వారి అమితకోరికలవల్ల వివాహముగాక యౌవనకాలము దాటిపోవును. చెల్లెండ్రకు వివాహముగాక వారికొరకై యౌవనకాలము దాటిపోవును ఇరువురుగాని, నలుగురుగాని సోదరులుండి వివాహమునకు బలము తగ్గును. వారు బాధనీయులుగా నుందురు, దీనిని కుజదోషమందురు. శుభుడై యుండిన కుజదోషముండదు. అన్యోన్యముగా సంసారము నడచును- కుజుడు సప్తమమందుండి, తృతీయ నవమములలో స్త్రీ గ్రహము పాపియైయుండిన చెల్లెండ్రివల్ల యౌవనకాలమంతరించిన వెనుక నచ్చని వివాహమగును.

సప్తమమున శుభుడై బుధుడుండిన మేనమామకూతురు బావ కూతురుండును. ఆ యింటికి మామగాని, బావగాని ఆదిపత్యముందురు అన్యోన్యముగా కాపురము నడచిపోవును. వివాహసమయములో ఏఆటం కములు గలుగవు, రూపవతిగా కన్యకుండును. మామ, అత్త గౌరవిం తురు. ఉత్తరదిశన కన్యకుండును.

పాపియై బుధుడుండిన బావ, మామ అధిపత్యముండి వివాహ మునకు ఆటంకములు గల్పించుచుందురు. వివాహములో రోగబాధలు గలుగును లేదా కన్య బావ మామ యింటిలోనుండి ఇవ్వకనో చేసుకొనక కనో బాధ గలుగును. నచ్చనిచోట వివాహము చేయును కలహముల గల్పించును. రోగపీడితనుగా నచ్చని దాంపత్యముగా చేయును.

గురువు శుభుడై సప్తమ మందుండిన ఆ ఇంటికి అబ్బ, తాత ఆదిపత్యముండును. కన్య యోగ్యురాలుగా వినయవిధేయతలుగలదిగా పాపపుణ్య విచక్షణజ్ఞానము గలదిగా నుండును. ధన కనక వస్తువాహ నాది సంపదలతో గృహప్రివేశము చేయును, అమిత సుఖములను భవింతురు. వృద్ధాప్యములో ఆమితసౌఖ్యమనుభవింతురు. అత్తవారింటి వారు గౌరవముగా చూతురు. కోరినవన్నీయిత్తురు. ఈశాన్యమూల కన్యకుండును. అత్తవారు ధనికులుగా నుందురు.

గురువు పాపియై సప్తమస్థానమందుండిన ఆయింటికి అంతరంగికమంత్రిగా ఒకధనికుడుండును. అబ్బ, తాత వివాహమునకు ఆటంకముల గల్పించుచు వరదక్షిణ అపరిమితముగా కోరుచు యౌవనకాలములో వివాహము కానివ్వరు. కన్యక అయోగ్యురాలు పట్టుదల గలిగినది, పెద్దవారిని లక్ష్యము చేయనిది, నిరంతరము మాషణల తినునది, ధనకనక వస్త్రాభరణములకై చింతించునదిగా నుండును. వివాహసమయమునకు ధనము కొరత గల్పించును అపశకునములనేకము గల్పించును చక్కగా జరిపించు పౌరోహితుని చూపింపడు. ఆభరణముల కొరత గల్పించును. బంధువులను దూరము చేయించును. వివాహములో కలతల సృష్టించును-

సప్తమమున శుభుడై శుక్రగ్రహముండిన అత్తకూతురుండును ఆ యింటికి స్త్రీల ఆదిపత్యముండును. సుందరవతియు కామకళానైపుణ్యము గలదియు, గాన కళయందభిరుచి గలిగినదియు, పురుషులకు ఆకర్షణీయమైనదియు, బుద్ధిబలముగలదియుగా నుండును. అన్యోన్యముగా సంసారము నడుపుశక్తిగలదిగా నుండును- అత్తగారింటివారు గౌరవమర్యాదలతో చూతురు. ఆగ్నేయమున కన్యకుండును. అత్తగారింటనే వుండు యోగముండును. స్త్రీలు ప్రేమింతురు, ఆదరింతురు. కన్యకలతో స్నేహము లభించును.

శుక్రుడు పాపియైయుండిన అత్త కూతురు నివ్వరు అన్యోన్యములేని సంసారమగును వ్యతిరేకముగా నడచును అత్తగారు శత్రువులగుదురు సంసారము చిక్కుల పాలగును అనుమానమునకు ఆస్పదమగును. దుఃఖజీవనము నడుపవలసివచ్చును, భార్య కోపగ్రస్త నేరగ్రస్త శోకగ్రస్తయగును లేదా దూరగ్రస్తయగును. పట్టుదల పురుషునకన్నా యెక్కువుండును.

సప్తమమున శని శుభుడై యుండిన ఆయింటికి విధవగాని, విధురుడుగాని, రోగిగాని ఆదిపత్యముందురు. పశ్చిమదిశగా కన్యకుండును ఆస్తి సంక్రమించుటగాని, అక్కడనే వుండుటగాని వుండును. అత్తవారిల్లు ప్రీతిగా నడచును- భాగ్యవంతులుగా నుందురు— భాగ్యము లభించును- విధవస్నేహము గలుగును స్త్రీలకు ప్రీతిగలవాడగును.

శని పాపియైన విధవపెత్తనముతో సంసారము భిన్నమగును. ధనవ్యయమగును సప్తవ్యసనములు లభ్యమగును. వివాహ ప్రయత్నములలో చావులు సంభవింపచేయును. ఒకటి రెండు మూడు సంబంధములు తప్పిన తదుపరి వివాహమగును. కలహముల గల్పించును. స్త్రీల కలహములు గలుగును. వస్తువులు పోవును.

## - కుజదోషము -

శ్రీ;- స్వామీ కుజదోషము కుజదోషమని ఎలుగెత్తి వాపోవునట్లుచేసి వివాహములకు చిక్కుల గల్పించినారు. ఈ కుజుడొక్కడే శాస్త్రజ్ఞులకు దోషియని గానవచ్చెనా మిగతాగ్రహములు నిర్దోషులనియా వీరిభావము. వారు నైసర్గిక పాపులన్న రవి శని రాహు కేతుగ్రహములు కారనియా? 1, 2, 4, 6, 7, 8, 10, 12 స్థానములేనా. 3, 5, 9, 11 స్థానములలో పాపఫలమియ్యడా? కుజుడు పాపఫలమిచ్చుస్థానములలో శనియుండిన పాపఫలమియ్యడా? ఎందుకిట్లు వ్రాసిరని గమనించువారు లేరా. తెలియచెప్పుడు

గు:- వత్సా కుజదోషమని వ్రాసిన పండితుడు శాస్త్రములోగల మంచిచెడ్డలను గమనించక శ్లోకము పాండిత్యబలముతో అల్లినాడుగాని జ్యోతిశ్శాస్త్రబలముతోగాదు. విన్నన్న చెప్పినది వేదమన్నట్లు అందరు దానిని పాటించుచున్నారు. పరిశీలన చేసినవారు లేరు. కుజుడు దోషికాదు.

సర్వే త్రికోణనేతారో గ్రహా శుభఫలప్రదాః అన్న శ్లోకము జ్యోతి శ్శాస్త్రమునకు ప్రాణవాయువని తెలుచున్నది. ఈ ప్రమాణ వచన ప్రకారము చూచిన సర్వము గోచరమగును. ఆరిపోయిన జ్యోతి మళ్లీ వెలుగు నిచ్చును. గమనింపుము. మీన మేష కటక సింహ వృశ్చిక ధనస్సులకు లగ్న పంచమ నవమములకు త్రికోణాధిపత్యము వహించిన కుజుని దోషియనుట పాండిత్యబలముగాని శాస్త్రబలముగాదు- ఇదేలగ్నములకు ఇదేస్థానములలో శనియుండిన సర్వనాశనముచేసి కొంపగూల్చుచున్నాడు. అప్పుడు శని దోషికాడా. వృషభ మిధున కన్య తుల మకర కుంభములకు శనియుండిన సర్వశుభముల చేకూర్చును. కుజుడుండిన సర్వనాశనము చేయును. గురుడుండిన నేలమట్టము చేయును. గురు కుజ శనులకు రెండుచూపులు ఎక్కువగా నుండుటవలన శుభులైన మేలు చేయుదురు. పాపులయిన కీడుచేయుదురు. హరిహరరూపమై శాస్త్రము పుట్టినది గాన చావుపుట్టుకలకు మంచి చెడ్డలకు కారణభూతులైవున్నారు. గురు కుజ రవి చంద్రి కేతుగ్రిహములు హరి అంశమున శని శుక్రి బుధ రాహుగ్రిహములు హరుని అంశమున జననమై చావుపుట్టుకలు గల్పించుచున్నారు. మీన మేష కటక సింహ వృశ్చిక ధనస్సులు హరిపాలన-, వృషభ మిధున కన్య తుల మకర కుంభములు హరుని పాలన గలిగియున్నవని గ్రహించలేదు శాస్త్రకారకులు. అందువల్ల శాస్త్రములు పదభ్రష్టమైపోయి ఇది నామతము ఇది నామతమన్నారు దృక్కుకు ఒకటిరావు.

వత్సా గ్రహరూపీ జనార్దన అన్నచోట గ్రహరూపీ మహేశ్వర అన్నమాట ఉన్నదని తెలియలేదు. విష్ణువు పురుషరూపమై, శివుడు స్త్రీ రూపమై విశ్వమును సృష్టించుచు ద్రుంచుచున్నారని తెలుసుకొనుము. గ్రహములకు స్థానాధిపత్య దోషమున్నది గాని నైసర్గిక

పాపత్వము ఒక్కరికికూడా లేదు. శాస్త్రజ్ఞులు నైసర్గికపాపులు రవి, కుజ, శని, రాహు కేతువులని వక్కాణించిరి. ఇందువల్ల జ్యోతిశ్శాస్త్రము అధోగతి పాలయినదని గ్రహించుకొనుము.

## - మూర్తి ద్వేషము -

స్వామి త్రిమూర్తుల సమానదృష్టితో చూడకపోవుట దోషమే నందుర-

వత్సా విష్ణువును తలంచక ద్వేషించినవారిని గురు, కుజ, రవి, చంద్ర కేతుగ్రహరూపమై బాధించి వేధించును.

శివుని తలంచక ద్వేషించినవారిని శని శుక్ర బుధ రాహుగ్రహ రూపమై బాధించి వేధించును- బ్రహ్మను తలంచక ద్వేషించినవారిని చంద్రుడై బాధించును. అజ్ఞానాంధకారములో నుంచును- గాన ముగ్గు రిని సమానదృష్టితో చూచినవారికే గ్రహానుకూలత దశానుకూలతగలిగి ఉన్నతస్థితి నాక్రమించుకొందురు. అట్టివారే ప్రభుత్వోద్యోగులు ధని కులు పండితులు జ్ఞానులు నిరోగులు కవులు గాయకులు కీర్తి గౌరవ ప్రతిష్ఠల నార్జించిన పుణ్యాత్ములు.

వత్సా త్రిమూర్తుల ధ్యానించి త్రిదేవుల తలంచకపోయిన స్త్రీ సుఖము కరువగును. సన్యాసయోగము పట్టును మైథున నిద్రాహారము లలో మైథునము సున్నయగును. కళత్రము రోగిష్టి పాపిష్టి కోపిష్టి యగుటో శోకగ్రస్త నేరగ్రస్త దూరగ్రస్తయగుటో తటస్థించును. స్త్రీ లెల్లరు ద్వేషింతురు. త్రిమూర్తులతోపాటు త్రిదేవుల ధ్యానించి పూజించి నైవేద్యమిచ్చినవారే ధన్యాత్ములు. త్రివిధసౌఖ్యములు వారి నాశ్రయించునని నమ్ముము- ఈ విషయముల గ్రహించకపోవుటచేత మానవులు కష్టనష్టముల పాలగుచున్నారు.

## - గో చా ర ము -

వత్సా గోచారము చూచువారు నామనక్షత్రముపై ఆధారపడి నారాయణ, నాగమయ్య, నాగభూషణము నాతోచేరిన వారికందరికి ఒకేఫలము చెప్పుచున్నారు. ఇది జరుగనేరదు— ఒకపేరు యెందరికో వుండును. అందరి కొకేవిధముగా యెట్లు జరుగును. నానీనూనె అనూరాధ అన్నారు. ప్రధమాక్షరములలో యేపేరువచ్చినను గురు శనుల చూచి చెప్పి హాస్యాస్పదమగుచున్నది జోస్యము దీనికితోడు ద్వాదశాష్టమ జన్మంతు శని అంగారకో గురుః కుర్వంతు ప్రాణసంచేహం స్థానభ్రిష్టం ధనక్షయం అన్న శ్లోకమును చదివి లగ్నములో అష్టమములో ద్వాదశములో శని కుజ గురురవులున్న కష్టము నష్టము స్థానభ్రిష్టము ధనక్షయం పాౖణసందేహం పరాభవమన్నారు. ఈ లగ్నములకనిలేదు గురుపాలిత లగ్నములకు శని శనిపాలిత లగ్నములకు గురుకుజరవులు వచ్చిన జరుగును. గురుపాలిత లగ్నములకు గురుకుజరవులు వచ్చిన యెంతో బాగుపడుదురు. శనిపాలిత లగ్నములకు శని వచ్చిన మిగుల శ్రేయము గలుగును. అట్లగాక కలేసి కొటాౖ కావేటిరంగా అన్నట్లు కలేసి అన్నిటకు చెప్పిన జోస్యము దెబ్బతినును.

వత్సా గురుపాలిత గ్రహముల శనిపాలితగ్రిహముల తెలియక పోయిన జ్యోతిష్యము అధోగతి పాలగును. చూచేచోలా అశ్వని అన్న వచనములు జోస్యము పాౖణము తీసినవి. నీవు వీటిని చూడక అడిగిన కాలమునుబట్టి లగ్నమేర్పరచుకొని గురుపాలిత శనిపాలితముల గమనించి అకాలములో గ్రిహము లెచ్చటెచ్చటనున్నవో వేసుకొని చెప్పుము చక్కగా వచ్చును. పేరులో అదృష్ట దురదృష్టములులేవు. మనిషిని గుర్తించుటకేనని తెలుసుకొనుము.

## - జననము -

శ్రీ:- స్వామి జననము గురించి దుష్ట తిథి వార నక్షత్రము లని కొన్నిటిని చెప్పి తండ్రికి కీడు, తల్లికి కీడు, మామకు కీడు, అవ్వా తాతకు కీడు, జ్యేష్ఠులకు కీడుఅని అంతటితో పోనియ్యక జ్ఞాతులకు కీడు అని చెప్పినారు తమరేమందురు.

గు:- వత్సా జననములో మరణములో ప్రజలు అడుగుచుందురుగదా. సమాధానము చక్కగా దొరుకక దుష్ట తిథివారనక్షత్రముల గల్పించినారు. తిథివార నక్షత్రములకు గ్రహములులేక మంచి చెడ్డలు గల్పించు శక్తి ఉన్నదా లేదా అను సందేహముపడక అడిగెడివారులేక వారికి తోచినట్లు వ్రాసినారు. తిథికిగాని. వారమునకుగాని నక్షత్రమునకుగాని శుభాశుభముల గలిగించుశక్తి లేదు. ఏనక్షత్రమైనను దానిపై చంద్రుడుండును. చంద్రుడు ఆలగ్నమునకు శుభుడా అశుభుడా అను విషయము తెలుసుకొనవలయును. శుభుడైన సత్ఫలమే యొసంగును. అశుభుడైనచో అశుభఫలమే నిచ్చునుగాని, నక్షత్రమేమీ చేయజాలదు. గ్రహములేని నక్షత్రములేమి చేయుచున్నవో ఈ నక్షత్రము అంతే నక్షత్రశాంతియన్నారు. చంద్రునికానక్షత్రమునకా శాంతిఅని అడిగిన వారులేరు. పెద్దవారిని అడుగకూడదను నియమము పాటించినారు. అయిన మనముకూడా అట్లు తలంచిన శాస్త్రము చెడిపోవును. మనది ఒకమతముగా భావింతురు గాన చెప్పెదను.

వత్సా లగ్న ద్వితీయముల సప్తమాష్టమముల షట్స్థానమున పాపగ్రహములున్న జాతకునికి కీడుగా నుండును- చతుర్థము మాతృస్థానము చంద్రుడు మాతృకారకుడు మాతృకారకుని యిల్లు కటకముగద చతుర్థమున ఒకపాపగ్రహముండడమో చూడడమోవుండి చంద్రునికిపాప గ్రహ వీక్షణగలిగి కటకమున ఒకపాపగ్రహ ముండడమో చూడడమో

గలిగెనేని తప్పక కీడు గలుగును. ఈ మూడింటిలో స్థానముగాని కార కుడుగాని శుభస్కరమై నిలచియుండిన తల్లికికీడు తప్పిపోవును-- పితృ స్థానము నవమము, పితృకారకుడు సూర్యుడు, కారకుని యిల్లు సింహము. పితృస్థానములో నొకపాపగ్రహముంచుటయో, పితృకారకుని పాపగ్రహము చూచుటయో గలిగి పితృకారకుని గృహములో పాపులుండినా చూచిన పితృగండముండును. ఇందులో స్థానమో, కారకుడో శుభస్థితిజెందిన తండ్రికి కీడు తప్పిపోవును— ఏకాదశమమున పాపులుండి కుజుడు, కుజస్థానములు పాపత్వముజెందిన అగ్రజులకు కీడు. ఇందులో కొన్ని శుభస్థితిజెందిన కీడు తప్పిపోవును. జేజబ్బకు జేజికి కీడు తప్పిపోవును. అంతేగాని నక్షత్రములు, తిథులు, వారములు మానవుని బాధింపజాలవని తెలుసుకొనుము- శాంతి చేసినయడల జనన లగ్నమునకు శుభాశుభములు తెలుసుకొని పాపులకు సంకల్పయుతముగా దానము, శుభులకు సంకల్పయుతముగా పూజ చేయించుట శ్రేయము, శాంతిహోమము చేయించుట క్షేమమేయగును. దీనికికూడా సంకల్పముండవలయును. ఉదా- మేష లగ్నమే జననమనుకొనుము. తండ్రిగాని, తల్లిగాని చేయించునపుడు మమకుమార జననకాల మేషలగ్న చతుర్థస్థాన పునర్వసు నక్షత్ర చతుర్థ పాదస్థిత రాహుగ్రహదోష నివారణార్థం షట్స్థాన హస్తానక్షత్రి చతుర్థ పాదస్థిత శనిగ్రహ దుర్దోష నివారణార్థం- సప్తమస్థాన విశాఖానక్షత్ర ద్వితీయపాదస్థిత బుధగ్రహ పీడా పరిహారార్థం- నవమస్థాన పూర్వాషాఢ నక్షత్ర తృతీయ పాద స్థిత శుక్రగ్రహ దోషపరిహారార్థం ఆయురారోగ్యభాగ్య వృధ్యర్థం గురు కుజ రవి చంద్రకేతుగ్రహ శుభఫలావాప్త్యర్థం శాంతిహోమం కరిష్యే అను సంకల్పముతో హోమము చేయవలయును. శని శుక్ర బుధ రాహుగ్రహములకు తక్కువగను, గురు కుజ రవి చంద్ర కేతు

గ్రహములకు ఎక్కువగను హోమము చేయవలయును. క్షీరతర్పణము కూడ అదేవిధముగా చేయుట శ్రేయాదాయకము. ఏ లగ్నమునకు పాపులెవరో శుభులెవరో తెలుసుకొని పాపులకు సంకల్పముతోదానము శుభులకు పూజ, ఆవాహన విసర్జనచేయవలయును– శుభుల ధాన్యము యజమానికే విడువవలయును- యజమాని ఆ యా ధాన్యముల ఆ యా ధాన్యములలో కలుపుకొనినయడల శుభస్కరమగును- (1981-11-21 తేది గ్రహములు) నవగ్రిహధాన్యములు- రవి గోధుమలు, చంద్రుడు బియ్యము, కుజుడు కందులు, రాహువు ఉద్దులు, గురువు శనిగలు, శని నూగులు, బుధుడు పెసలు. కేతువు ఉలవలు, శుక్రిడు అనుములు లేక అలసందలు- వస్త్రములు- రవి గోధుమరంగు, చందిృడు శుద్ధతెలుపు, కుజుడు ఎఱుపురంగు, రాహువు పొగరంగు (ధూమ్రి వర్ణము) గురువు పసుపురంగు, శని నలుపురంగు, బుధుడు ఆకుపచ్చ రంగు, కేతువు చీటీరంగులు (చిత్రివర్ణము) శుక్రుడు ముతకతెలుపు, ఏగ్రహమునకు దానమియ్యవలయునో ఆధాన్యము ఆరంగువస్త్రముతో సంకల్పయుతముగ దానమియ్యవలయును.

స్వామీ :- ఏదివచ్చినా నవగ్రిహములకు జపము చేయుచున్నారు. నవగ్రహములన్నిటకు జపముచేసిన శుభమనవలెనా, అశుభమనవలయునా శలవిండు.

గు:- వత్సా ఇది లోకమంతయు పాటించుచున్నది ఇట్లచేసిన ఆ గృహములో గ్రహాయుద్ధము జరుగును. పాపులు బలవంతులైన అనగా స్వక్షేత్రిములలో ఉచ్చలో మిత్రిక్షేత్రిములలో ఉన్నయింటిలో ప్రధమపాదములలో నుండిన ఆ జాతకునకు కీడేగాని మేలుగాదు. ఆ యింటికి లేనిపీడ తెచ్చిపెట్టినట్లగును. పనికిరాదు. నవగ్రహముల నవ ధాన్యములపై మండలములవ్రిసి ఆవాహనచేసి పూజించి విసర్జన

చేయించి పాపగ్రహ ధాన్యముల ఒక్కొక్కరికి ఒక్కొక్క ధాన్యము సంకల్పయుతముగ దానమియ్యవలయును. శుభగ్రహ ధాన్యముల యజమానికే వదలవలయును. పాపగ్రహ దానముల తీసుకొన్నవారికి యజమాని ప్రదక్షిణ నమస్కారములు చేసినవారు ఆశీర్వచనములతో అక్షింతల వేయుదురు. ఇట్లుండవలయును గాని జపాలు చేయించరాదు. తన్నేవాడిని యింటికి పిలచినట్లుండును గాన శాంతిహోమము చేయవచ్చునుగాని జపాలు చేయరాదు. గ్రహయుద్ధము తప్పక జరుగును. ఇంటికి యజమానికి విపత్తు తటస్థించును.

## - గృహ ప్రవేశములో బియ్యం కాలదన్నుట -

ప్రశ్న:- స్వామి కన్య గృహప్రవేశమునాడు వాకిలి కడపపై గ్లాసులో బియ్యము పోసిపెట్టి వధువు ఆ బియ్యము కాలితో యింటిలో పడునట్లు తన్ని ఇంటిలో కాలు పెట్టమందురు. దీనినేమందురు.

వత్సా ఒడిలో బియ్యము శుభమని పెట్టుకొని అశుభస్కరముగా లక్ష్మీకరమైన బియ్యమును కాలదన్నుట అశుభస్కరమని భావింపలేదు. తెలియనివారు తెలియనట్లుండిన ప్రమాదము సంభవింపదు తెలిసినట్లు వర్తించిన తప్పక ప్రమాదము సంభవించునన్నారు. ఈ పురాణోక్తములు కొన్ని మానవుల విపత్తులపాలు చేయుచున్నవని గ్రహించు వధూవరులకు ఎఱ్ఱనీళ్లు తీసిన తదుపరి టెంకాయను వధూవరులకు దిగదీసికొట్టి వరుని కుడికాలు వధువు ఎడమకాలు గృహములో పెట్టమని అటుపై గృహప్రవేశ ముహూర్తములో చెప్పినప్రకారము ఆచరించుట శ్రేయము—

## - మ ర ణ ము లు -

ప్రశ్న:- స్వామి దుష్టనక్షత్ర తిధివారములందు మరణము ఇంటిలోగాని వెలుపలగాని జరిగిన 40 దినములు, మూడునెలలు, ఆరు నెలలు గృహము విడువవలయును. ఇంటికి కంప కొట్టవలయునని చెప్పుచున్నారు. విడువకుండిన గృహచ్ఛిద్రములు ప్రాణహాని జరుగునని భయపెట్టి ఇల్లు విడిపించుచున్నారు. దీనినేమందురు.

వత్సా శాస్త్రజ్ఞులకు తిధివారనక్షత్రములే గన్పడినవిగాని గ్రహములు కన్పడలేదు, లగ్నములద్వారా గ్రహములు సుఖదుఃఖముల గల్పించుచున్నవని సకలజీవరాశులు గ్రహబలముతో నడచుచున్నవని తెలుసుకొనలేదు. జననములో శాస్త్రజ్ఞుడు లగ్నము ననుసరించుచున్నాడు, మరణములో అదేవుండునని తలంచలేదు. వారు అంతవరకే చూచి శాస్త్రమును సృష్టించినారు. నీవు గమనింపవలసినది లగ్నము మరణ సమయమునకు ఏలగ్నమో ఆ లగ్నమునకు గ్రహము లెట్లున్నవో గమనించి చెప్పవలయును, చతుర్ధము గృహముగద. గృహస్థానమున మరణ సమయములో అనగా లగ్న చతుర్ధములో లగ్న పంచమ నవమస్థానాధిపతులుండిన ఇల్లు విడువ పనిలేదు. 3, 6, 8, 12 గృహముల వారుండిన కర్మ అయిపోవు దనుక విడుచుట మంచిది. అష్టమాధిపతివుండిన పశువాకుక్కో కోడియో ఏదోవకప్రాణి ఆ యింటిలో పోయినదనుక విడువదు గాన తగుశాంతి చేయించుకొనుట శ్రేయము— కర్మ అయిపోయిన మరుదినము పుణ్యాహవాచనము చేయించి అహోరాత్రులు అఖండలముపెట్టి ఆంజనేయ సహస్రనామముగాని, శ్రీ లక్ష్మీనృసింహ సహస్రనామముగాని రెండు వేళల చేయించి మరుదినము పూజచేయించి చేరుకొనవచ్చును. 40 దినములు 3 నెలలు, 6 నెలలు విడువపనిలేదు.

## - గ్రహణము -

స్వనక్షత్ర స్వరాశివారు నక్షత్రశాంతి చేసుకొనుట మంచిదనిరి. జరుగుచున్నది గ్రహాయుద్ధముగాని, నక్షత్రయుద్ధముగాదుగదా గ్రహములకు చేయక నక్షత్రములకు చేసిన మానవునికి సుఖశాంతులెట్లు నక్షత్రమొసగునో తెలియకున్నది. మానవులకు నూటికి యాభైవంతులు సుఖశాంతులొసగు చంద్రగ్రహము దుష్టపరిపాలకుడగు రాహువు నకెదురై అమృతము హాలాహలమైనట్లు మానవులకు సుఖశాంతులొసగు అమృతకిరణములు అసుఖశాంతులు, వాంతులు గాకుండ నక్షత్ర శాంతి చేసుకొనుట నిష్ఫలమౌనుగాని ఫలము చేకూరుసా? ఏ లగ్నము వారికిది ఉపద్రవము, ఏ లగ్నము వారికిది శ్రేయోదాయకమను చర్చనే చేయక శాసించుట చూడ చర్చనీయము. చర్చించి నిశ్చయము బయల్పరచినవారిని గానము.

నక్షత్రముపై గ్రహము లేక నక్షత్రము మానవులకు మానవుని కననేల. సర్వజీవులకు ఏమిచేయజాలదు. గ్రహముద్వారా లగ్నము ననుసరించి శుభాశుభముల ప్రసరింపచేయునేగాని నక్షత్రమెంతమాత్రము ఫలముల ప్రసారము చేయజాలదు. అట్లు చేయుననిన ఇరువదేడు నక్షత్రములలో గ్రహములకు తొమ్మిది నక్షత్రములు పోను మిగులు పదునెనిమిది నక్షత్రములుండునుగదా. వాటిమాటేలేదు. ఏ మాట మాట్లాడినను గ్రహమందుండవలయును. గ్రహమే ఫలమీయవలయును గాన నక్షత్రము తనువు గ్రహము జీవము రెండు కలిసినపుడు ఫలము వెలువడును గాన నక్షత్రమునకు శాంతిలేదు అశాంతిలేదు-

పూర్వులు నక్షత్రమునకు మిగుల ప్రాధాన్యత నొసగిరేగాని గమనించిన చేసిన కార్యము వృధాయగునని తెలియుచున్నది. నక్షత్రములో లగ్నము ననుసరించి ఏ ఏ వస్తుసముదయమున్నదో దాని సను

సరించి ఫలముల గ్రహామునుండి వెలువడి జీవులకు శుభాశుభముల నొసగుచుండును. గనుక నక్షత్రశాంతి యనునది లేదు. గ్రహశాంతి యున్నది.

ఆనాడు ఆ నక్షత్రముపై గ్రహణము జరుగుచుండెను. గాబట్టి లగ్నాత్ ఆస్థానమెన్నవదో గ్రహించి ఆ నక్షత్రమున ఎన్నెవపాదమున గ్రహణము జరుగుచున్నదో అందులో పాపులెవ్వరో గమనించి సంకల్పము చెప్పి ధాన్యము వస్త్రము మంత్రపూరితముగ దానమిచ్చుట శ్రేయోదాయకమగును.

ఆ గ్రహణము శుభమా, అశుభమా అని ముందు గమనించవలయునుగదా. గమనించక దేశమునకంతటికి ఒకేమూకటి మూయరాదుగదా బాషాజ్ఞానమేగాని మావానికి లోకజ్ఞానము, వ్యవహారజ్ఞానము తక్కువన్నట్లు వ్యావహారమునకు దృక్కుకు శాస్త్రము నిలువకపోయిన అశాస్త్రీయమగునుగదా.

## - గ్రహణపర్వము -

గ్రహణము కొన్ని జాతకములకు శుభఫలమును, కొన్ని జాతకములకశుభఫలము నొసంగుట గలదు- దీనిని పుణ్యకాలముగ భావించుట చాలా శోచనీయము. గ్రహణమొక విపత్కరకాలమనియే భావించవలయును గాని శుభకాలమనరాదు. చంద్రునకెదురౌ రాహుకేతువులు పాపులుగ భావించవలయునేగాని శుభులుగ భావించరాదు. అశుభకాలమనియే శాంతి కొరకు జపతపములు, అర్చనలు, ప్రదక్షిణ నమస్కారములు, స్నాన సంధ్యావందనములు చేయుచుండిరి. గ్రహణమొక గడ్డుదినము.

## -: దానము :-

గ్రహణకాలములో దానము లిచ్చుట శ్రేయోదాయకముకాదు. విపత్కరమైన కాలముగ పరిగణింపవలయును. దైవార్చన జపతపాదులే ముఖ్యమనుట క్షేమము.

## - మంత్రసిద్ధి - శుద్ధి -

మంత్రములు శుద్ధిచేయుటకు మంచికాలమనియు మంత్రము సిద్ధించుననియు మంత్రాధిష్ఠానదేవత అనుగ్రహించుననియు నీళ్లలో నిలుచుకొని పఠించుట మంచిదనియు, మంచిసమయమనియు, అందులో శక్తిపర్యాయమంత్రయంత్రములకు శాక్తేయముగ జీవహింసలుచేయుట మంచిదనియు, మేలుకొరకై జంతుబలి చేయుచున్నారు. ఇది పాప ఫలమే యిచ్చునుగాని శుభఫలమియ్యజాలదు- ఇది తెలియనితనము మంత్రము సిద్ధించవలయునన్నను అధిష్ఠానదేవతానుగ్రహము పొంద వలయునన్నను దీక్షలు చేయవలయునన్నను లగ్నపంచమ భాగ్యస్థానములలో శుభులుండి పాపులచే చూడబడకయుండవలయుగాని గ్రహణ కాలములో మంత్రము పవిత్రముగాదు శుద్ధిగాదు ఫలించబోదు-

గ్రహణము వచ్చుదినమునకు ముందు మూడు నాలుగు దినములనుండి ఒక్కొక్క కిరణము చంద్రునిపై పడుచుండునుగాన ఏదిచేసుకొనవలయునన్నను చేసుకొనుట క్షేమము. ఏ విపత్తులు గల్పించినను ముందే గల్పించవలయునుగాని గ్రహణము విడిచిన తదుపరి ఏ విపత్తులు గలుగవు. దేశారిష్టము అంతకులేదు. గ్రహణకాలములో ఇంటింట దేవుని దీపము పెట్టివుండుట మంచిది. గ్రహణానంతరము స్నానముచేసి దేవుని పూజించి తీర్థప్రసాదముల పుచ్చుకొని అటుపై కార్యక్రమములందు పాల్గొనుట క్షేమము- గర్భవతులున్న గృహము

లలో కమురుకంపు పెట్టుదురు ఇది నీచము పెట్టరాదు. దేవుని చెంత దీపముపెట్టి మంచిసువాసనగల ఊదువత్తుల ముట్టించి నారాయణ అష్టాక్షరిగాని, శివపంచాక్షరిగాని గ్రహణము విడుచుదనుక చేయుచుండుట క్షేమము లేదా వనమాలీగదీ శార్జ్ఞీ శంఖీ చక్రీచ నందకీ శ్రీమన్నారాయణో విష్ణుర్వాసుదేవోభిరక్షతు అను మంత్రము నుచ్చరించుచుండుట శ్రేయోదాయకము-

## - గ్రహణకీడు -

గ్రహణమువల్ల గర్భములోనున్న శిశువునకు కీడువచ్చునని తలంచుచున్నారు. ఎంతోకాలమునుండి వచ్చుచున్నది. దీనిని విమర్శించిన గ్రహణకీడు గాదు. పూర్వజన్మ పాపపుణ్యములు గర్భమైనది మొదలుకొని వెన్నాడుచుండును. ఏ యవయవము లోపించవలయునో ఆ యవయమునకు అవయవములకు నాయకులైన గ్రహములు పాపపుణ్యానుసరణముగ అవయముల నొసంగుటలో పాపము కొన్నిటిని లోపింపచేయును. పుణ్యము కొన్నిటిని చక్కగా నుంచును. అందువల్ల శరీరములో కొన్నిభాగములు లోపించును. జననమైన తదుపరికూడ ఏ గ్రహకిరణములు లోపించునో ఆ యవయవములు లోపించుచు రోగముల గల్పించుచుండును గాని గ్రహణమువల్ల కలిగినవికావు- మానవప్రయత్నముగా గ్రహణకాలములో గర్భవతులు దైవధ్యానము చేయుట క్షేమము-

గురులగ్నములగు మీన మేష కటక వృశ్చికములకు చంద్రకేతు గ్రహములు శుభులుగాన కేతుగ్రస్తగ్రహణము శుభమే గలిగించును. రాహుగ్రస్తము కీడు. ధనస్సు సింహాములకు రెండు కీడుగానేవుండును. శనిపాలితలగ్నములగు వృషభ మిధున కన్య మకర కుంభములకు కీడు

గలిగించును. తులాలగ్నమునకు రాహుగ్రస్తము మేలు- కేతుగ్రస్త గ్రహణము కీడు-

శని దేశారిష్టమునకు గురువు దేశకాల సుభిక్షమునకు అవతార పురుషులుగాని వేరుగ్రహముల కుండదు. వీరిచూపు యెచ్చటపడిన అచ్చట శుభాశుభములు రేగుచుండును-

## - గ్రహణ లగ్న శుభాశుభములు -

మేషలగ్నమునకు కేతుగ్రస్త గ్రహణము మంచిది. రాహు గ్రస్తమైన మధ్యమము- ఎట్లన మేషలగ్నమునకు చంద్రకేతువులు శుభులగుటచే ఏ విపత్తులు గలుగవు శుభమే కలుగును. రాహుగ్రస్త మైన రాహువు మేషమునకు పాపియై శుభుడగు చంద్రునితో కలియుట వల్ల పాపపుణ్య మిశ్రితమై మధ్యరకమగుచున్నది. శుభాశుభములు సమానముగ నుండును. గ్రహణకాలములో శుభగ్రహవీక్షణ పాప గ్రహ వీక్షణ గలదు. శుభులు చూచినట్లయిన కలిసినట్లయిన పాపఫ లము గలుగదు. పాపులు చూచినట్లయిన పాపత్వము మెండుగా నుండును జాతకునికి గ్రహణము గ్రహములు గమనించి చెప్పవలయును.

వృషభమునకు కేతుగ్రస్తగ్రహణము కీడు గలుగచేయును. రెండు గ్రహములు పాపఫలమిచ్చునవే గాబట్టి కీడు మూడును రాహు గ్రస్తమైన మధ్యమముగా నుండును- మిధునమునకు దీని ననుసరింప వలసినదేగాని వేరులేదు.

కటకమునకు కేతుగ్రస్త గ్రహణము శుభఫలమే యిచ్చును. రాహుగ్రస్తమై పాపులచే చూడబడిన పూర్తి అశుభ ఫలమిచ్చును. గ్రహశాంతి దేవతార్చనలు ముఖ్య ఆవశ్యకము, లగ్నాధిపతియే చం ద్రుడై చంద్రునికే పాపులు ఎదురౌటచే దేహపీడ తప్పకుండును.

కటకలగ్న జాతకులకిది పూర్తి గండకాలము. నదులలో, స్నానసమయములలో జాగ్రత్త ఆవశ్యకము. కలరా కాలములలో ప్రయాణసమయములలో, అరణ్యమార్గములలో ఒంటరిగ ప్రయాణము చేయరాదు. సురక్షిత స్థానములందుండవలయును. సర్ప, విష, మారికా, స్ఫోటక, అశ్వ. స్త్రీ, మధు పానాది చోరగండములు, నదులలో మొసళ్లగండముండును. జాగ్రత్తకాలము శుభులచే చూడబడిన కూడబడిన అశుభముండనేరదు- సమత్వమేర్పడును- ఏకనక్షత్రమున శనిరాహువులుండి గ్రహణమక్కడనే తటస్థపడి శుభులుచూడరేని గొప్పకీడు దేశమునకు ప్రజలకు సంభవించును- గ్రహణము ముందు వెనుకల కాలపరిమితి చెప్పిరిగాని ఆచరణీయమైనదికావని తెలియుచున్నది- చంద్రుడు ఆ రాశిలో ప్రవేసించినది మొదలుకొని రాశి విడచు పర్యంతము శుభాశుభములుండగలవు. రాశి విడచిన యథారీతిన కాలము నడచిపోవును. సింహలగ్నమునకు రాహుగ్రస్త గ్రహణము చాలా క్షోభింపచేయును. వ్యయస్థానాధిపతియగు చంద్రునితో పాపగ్రహము చేయుటచే సర్వకార్యములు వ్యయము చేయును. అగ్నిలో రాజభయముతో బాధలుండును. అన్ని లగ్నములకు ఇట్లే గమనింపవలయును-

## - తోకచుక్క -

కాలము నడుపునవి గ్రహములా లేక దానంతటది నడచుచున్నదా ? దైవము నడిపించుచుండెనా అన్నదే ప్రశ్న కాలము నడుపునవి, యుగముల నడుపునవి గ్రహములేనని దైవము కాదనియు, దైవము తన్నుదలచిన వారి యోగక్షేమముల తాచూచునుగాని, తలచని వారిని తలచడనియు ముందొనర్చిన పాపపుణ్యముల నవగ్రహకేంద్రములలో చేరియుండుననియు జీవులెందున్నను సుఖదుఃఖములరూపమున ప్రసరింపచేయు చుందురనియు, ప్రకృత జన్మమునందొనర్చు

నవి కేంద్రములలో నింపుకొనుచుండుననియు ఇటు భూగోళమున అటు ఖగోళమునకల వస్తుసముదయముల జీవరాసుల పాలసొశక్తి ప్రవా వము నవగ్రహములదేననియు నీవొనర్చునది నీవే అనుభవింతువు, అనుభవింపచేయువారు నవగ్రహములేననియు దైవము కారణమాత్రు డై యున్నాడనియు చేశావు బోశేశావు అన్న వాఖ్యముమీద మానవ జీవితము నాధారపడియున్నదనియు జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నదని చెప్పుచున్నారుగదా.

ఈ నవగ్రహములు ద్వాదశరాసులలో ఇరువదేడు నక్షత్రము లపై సంచరించుచు కాలము నడుపుచున్నవి. దేహబలము, జ్ఞానబలము ధనబలమను త్రిశక్తిబలము లిచ్చుచు శత్రురోగ ఋణవిపత్తుల ఉప ద్రవశక్తుల గల్పించుచు, పుట్టించుచు, గిట్టించుచు సుఖదుఃఖముల మధ్యన ముంచుచు తేల్చుచు ముందొనర్చినది పూరిపుల్లనుకూడ మరు వక గుడుపుచుందురని శాస్త్రమున్నదిగద— మానవుడు పాపపుణ్య మిశ్రితుడనియు, పశుపక్షి క్రిమికీటకాదులు శుద్ధపాపులనియు, దేవతలు శుద్ధపుణ్యులనియు చెప్పుదురు. మానవుడు పాపపుణ్య మిశ్రితుడౌటచేత కాలము పాపపుణ్య మిశ్రతమనియే చెప్పవలయును. అది పలానా సమ యమున వచ్చునని తెలియచెప్పునది జ్యోతిశ్శాస్త్రము కనుగలిగి బ్రతుకు నాయనా అన్నట్లు ఈజ్యోతివెలుగులో కనుగలిగి కాలగతుల గమనించి దైవప్రార్థనలతో జపతపాదులతో కాలము నెదిరించి బ్రతుకుటకు ఇదుగో స్థూలముగ తెలుసుకొనండియని చేతికందిచ్చినది షట్శాస్త్రము లలో నొకశాస్త్రము జ్యోతిశ్శాస్త్రము. ఈ శాస్త్రము అరగంటి నిదురలో పడుటచే లోకులు లోకము చెడుచున్నది.

జ్యోతిశ్శాస్త్రము అంజన, మంత్రాంగములు ఓషధీప్రభావము అందుబాటులో నుండిన కలియుగము నడువదు. ఎందుకనగ ఎవ్వరు

చేసిరీ దుష్కార్యము ఎవ్వరీ దొంగతనము చేసిరి అన్న విషయములు చెప్పగలుగు వారుండిన చేయువారుండరు ఈ మూలికయేమి పనిచేయ గలదను విషయము తెలిసిన పాపమన్న ఝడియని మానవుడు ఏ పని యైనా చేయగలడు. వేనవేలు ప్రజల క్షణములో చంపగలడుగాని బ్రతి కింపబోడు యుగధర్మమిది మంత్రాంగములు తెలిసినట్లయిన ప్రజల పీడింతురుగాని ప్రజలమేలు గోరరు. అంజనలు గలవాడు ధర్మా త్ముడు గాకపోయిన ప్రజలకు విపత్తులెదురౌను. గాన ఇవి మరుగు పరచవలసిన కాలము యెదురైనది. జ్యోతిష్యమున వంశపరంపరాను భవముగలవారు శాస్త్రము బైటపెట్టక పోవుటచే కాలక్రమేణ నశింపై నది ప్రకృతమున్న జ్యోతిశ్శాస్త్రములు అనుభవమునకు దూరమయ్యెను ఏమయ్యా నీవు చెప్పినది జరుగకపోయెనే అనగా ఆ దేవుని శాపము ఈ దేవత శాపమని కథను చెప్పి తప్పుకొనిరి. నిజము నీల్గి చచ్చెను. చెప్పువారరుదైరి. శాస్త్రము విలువ చచ్చెను. అందువల్ల కాలగతుల చెప్పు శాస్త్రజ్ఞులు ప్రమాణగ్రంథములు పలుదారులై ప్రజలకు వర్తిం చక పోయెను- ఇది వింతయేమీ కాదు కాల ప్రభావము- ద్వాదశలగ్న ములలో గురుపాలితములు శనిపాలితములని రెండుభాగలయ్యెను. శని గురువులు కథానాయకులై ద్వాదశరాసులందు సంచరించుచు గురుపా లితప్రజలను శని పీడించుచు శనిపాలిత ప్రజలను గురువు పీడించు చుందురు. గురుశనులు సమసప్తకమైరేని రెండుతెగల వారికి కీడే సంభ వించును. ఈ గురుశనులు ఒక్కరికొకరు యెదురగుటకు పండ్రెండు యేండ్లు పట్టును. ఆ సంవత్సరమంతయు ప్రజలకు ప్రభుత్వమునకు కీడు సంభవించును, అప్పటిలో తోకచుక్కలు పుట్టుచుండును. ఏ దిశన పుట్టునో ఆ దిశన విపరీతములు గలుగును. గురు శనుల కలయికలో కారిష్టమేయగును. గురువకు వెనుక శనియుండిన గురుపాలితులకు శనికి గురువు వెనుక నుండిన శనిపాలితులకు కీడు గలుగును.

ప్రజలకు, ప్రభుత్వమునకు చిక్కులు, చిచ్రిములు, ప్రాణాపాయములు, పరాభవములు కలుగును. అశుభసూచకముగా దుశ్శకునములు లోకమునకు చూపుటయే తోకచుక్కలు గలుగుటకు కారణము దుశ్శకునములు పొడసూపినప్పుడు మానవులకు తరుణోపాయము దైవ ధ్యానము దేవాలయములలో పూజావిధానములు యెక్కువగా చేయుట ఆరాధనలు, అర్చనలు చేయించుటయే ఈ అశుభనివారణోపాయము. ఏ కుటుంబములో ఆ కుటుంబము యిట్టి కార్యములు గ్రహములు విడిపోవునంతవరకు చేయుచుండుట క్షేమము. ఏ దిశన తోకచుక్క పుట్టునో, ఎంతవరకు కనబడునో అంతవరకు అశుభములు గలుగుచుండును. దేశారిష్టమున్నది ప్రజలకు అపాయమున్నది జాగ్రితపడుడని గురువు నియమించిన పతాకమనియే చెప్పవలయును. తోకచుక్కలు గురుశనుల కలయిక సమసప్తకము ప్రపంచమునకు అరిష్టము. ప్రతి ఆరేండ్లకొకసారి వచ్చుచుండును. శని రెండిండ్లనుచూచి ఆ గ్రహమును చూచిన మరింత అశుభములు తటస్థించును. రెండిండ్లు అనగా కుంభమున శని వున్నప్పుడు మూడింట మేషమును, పదింట వృశ్చికమును, ఏడింట సింహమును చూచును. తన ముప్పది నెలలలోపల లోపల కుజరవుల చూచినప్పుడంతయు ప్రజాక్షయమొనర్చును. మీనములో నుండి ధనస్సును చూచును. అప్పటిలో గురువును చూచిన మిగుల ప్రిజాక్షయమొనర్చును. కుంభశని యుద్ధములను గల్పించును. ప్రజల ప్రిభుత్వమును అల్లకల్లోలములో ముంచును గాన కుంభ శని భయంకరము- కన్యలో నుండి బుధక్షేత్రిముల బుధుని చూచి ప్రతి వస్తువుల విపరీతమైన ధరలకు పెంచి ప్రిజలకు అందుబాటు గాకుండ చేయును- సింహములో నుండి శుక్రిస శుక్రి గృహముల రెండిటిని చూచును. అప్పటిలో వాహన గండములను స్త్రీలవల్ల చిక్కులను గల్పించును. శుక్రికారకత్వములతో బాధించును.

ఇట్లే రెండిండ్లను కుజుడు చూచును. అప్పుడంతా ప్రజలకు మేలు చేయును- కుజుడు, మీన, మిధునములలో నుండిన బుధుని రెండిండ్లను చూచును. కటకములోనున్న శని రెండిండ్లను చూచును. కన్యలో నుండి గురునిండ్లను రెంటిని చూచును. తులలో నుండి శుక్రుని రెండిండ్లను చూచును. ధనస్సులో నుండి గురు రెండిండ్లను చూచును. మకరములో నుండి కటక సింహాముల చూచును. గురుపాలితములకు మేలుచేయును. శనిపాలితులకు కీడుచేయును. శని ముప్పయినెలలలో చేయుపనిని ఒకటిన్నరనెలలో చేయును. శనిపాలితలగు వృషభ, మిధున కన్య తుల మకర కుంభములకు పరమశత్రువై మృత్యువై బాధించును. గురుశనుల కలయికకన్న సమసప్తకములో ప్రజలకు ప్రభుత్వమునకు మిగుల బాధగా నుండును. అట్టి కాలములో తోకచుక్కలు యేదిశనో వకదిశన పుట్టుచుండును. ఆ విపత్తులు లగ్నమును బట్టి వారున్న నక్షత్రములబట్టి ఆ దిశన వుండును. మీనములో శని వుండి గురువును మూడింట పదింటచూచిన లోకమును అల్లకల్లోలము చేయును. తిండితీర్థములకు ప్రజల కష్టపెట్టును. ధనిక నిర్ధనికులకు కలహాముల పెట్టును. బ్రాహ్మణులకు అనిష్టము గల్పించును. ప్రపంచమునకు కీడు గలిగింపచేయును.

పాణిగ్రహణోపయోగ పంచకూట ప్రసూతి రజస్వలా శాంతి నక్షత్ర విమర్శన చక్రము వ్రాసినారు. ఇవి అన్నీ నక్షత్రమునను సరించి వ్రాయబడినవి. స్వర్ణ, రజత, లోహ, తామ్ర పాదములని నాలుగు పాదముల గల్పించినారు. ఇందులో విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ మూల లోహపాదమన్నారు. లోహపాదమున్న అమ్మాయిని చేసుకొనరు. విశాఖ నక్షత్రములోపుట్టిన అమ్మాయికి మరుదులున్న అపాయమన్నారు. తమ్ములున్న వరుడు చేసుకొనడు. మూలనక్షత్ర

మైన మామకు అపాయమన్నారు. మామవున్న చోట సంబంధము పదు రదు చేసుకొనరు. ఆశ్లేషనక్షత్రమైన అత్తకు అపాయమన్నారు. అత్త వున్నచోట సంబంధము కుదరదు. ఈ నక్షత్రములకే అంతటిశక్తివున్న దనిన నవగ్రహములేమి కావలయును. జాతక బలమేమి కావలయును.

గణకూటములో కృత్తిక, ఆశ్లేష, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, ధనిష్ఠ శతభిషము, మఖ, మూల, రాక్షసగణ మన్నారు. ఈ నక్షత్రములలో పుట్టిన అమ్మాయిని పెండ్లి చేసుకొనరాదని, స్త్రీ రాక్షసంన కర్తవ్యం అని ప్రమాణమును చూపియున్నారు- యోనికూటములో రోహిణి, మృగశిర, సర్పము, చిత్త, విశాఖ. వ్యాఘ్రము, ధనిష్ఠ, పూర్వాభాద్ర సింహం ఈ నక్షత్రములలో పుట్టిన అమ్మాయిని పెండ్లి చేసుకొనరాదు కావలయునన్న పేరు మార్చమన్నారు. పేరుమార్చిన దురదృష్టము అదృష్టముగ మారునా అన్నప్రశ్న బయలుదేరునుగదా. పేరులో అదృష్టమున్న అందరు స్త్రీలకు లక్ష్మీదేవిఅని, పురుషులకు వేంకటేశ్వ రులుఅని పేరు పెట్టుకొందురుగదా. పేరు మార్చిన నక్షత్రముమారును నక్షత్రము మారిన గణములు, కూటములు, పాదములు మారును. శుభము గలుగునని వారి భావము. నక్షత్రమందే శుభాశుభములు గల వని భావించినారు. ఉ;- విశాఖలో గురుపాలిత లగ్నములందు నాలగవ పాదములో జనించిన అమ్మాయికిగాని, అబ్బాయికిగాని దశానుకూలత గలిగి గొప్ప యోగజాతకులగుదురు. విశాఖలోహపాదం, రాక్షసగణము అంత్యనాది వ్యాఘ్రము వచ్చును. మరుదులులేని నక్షత్రమని పైన ఉండనే వున్నది- విశాఖనక్షత్రములో జననమైన అమ్మాయిని మీన మేష కటక సింహ వృశ్చిక ధనుర్లగ్నములవారు వివాహమాడిన త్రివిధసంపదలుగలిగి సుఖింతురు నిరుపేదకిచ్చినను తప్పక ధనికుడగును దశానుకూలత గ్రహానుకూలతలేని జాతకులు కాయకష్టము చేయుచు అష్ట

కష్టములపడుచున్నారు సోమరులై తిరుగుచున్నారు. ఇట్ల నక్షత్రమునకు బలాబలముల శుభాశుభముల గల్పించుటవల్ల పురుషులకన్నా స్త్రీలకు అపకారము జరుగుచున్నది. రూపము, విద్య, ధనము, వంశమర్యాద ఈ శాస్త్రమువల్ల దెబ్బతీయుచున్నది. గ్రహబలము తెలియక నక్షత్రములతో కృత్రిమముల గల్పించినారు. ఇది పాండిత్యబలమేగాని, శాస్త్ర బలముగాదని తెలియుచున్నది. నవగ్రహములు సంచరించుట తెలుసు కొనుటకు తిథులు, వారములు సృష్టించినారు. వీటికి ప్రాణములేదు- నక్షత్రములు ద్వాదశరాసులలో 27 టిని నియమించి నవగ్రహముల వాటిపై సంచరించునట్లుచేసియున్నారు. గ్రహము ఆరాశిలో ఏ గ్రహ నక్షత్రముపైయున్నదో ఆఫలముల ప్రసారము చేయుచుండును. మేష రాశిలో భరణీనక్షత్రముపై గ్రహముండిన దశలలో భరణికి శుక్రుడు గాన ఆ గ్రహము శుక్రుని కారకత్వముల కొన్నిటను ఆ జాతకునకు లభింపచేయుచున్నవని తెలియుచున్నది గ్రహము. ఏ దశానాయకుని నక్షత్రముపైయున్నదో ఆకారకత్వములు కొన్ని ఆజాతకునకు ప్రసార మగుచుండును. చేయుచుండును ఆ దిననక్షత్రముపైయున్న చంద్రుడు శుభుడైయుండిన శుభములనే చేకూర్చును. చంద్రుడు పాపియైయున్న పాపఫలములనే ప్రసారమగుచుండును. గ్రహమిత్రత్వ శత్రుత్వ సమ త్వములలో చంద్రునికి శత్రువులులేరన్నారు. వ్యయ తృతీయాధిపతి యైన బుధుడు శత్రువుగాడా. సప్తమ అష్టమాధిపతియగు శని శత్రువు గాడా, ద్వితీయాధిపతియగు సూర్యుడు శత్రువుగాడా, రవి బుధులు మిత్రులనడము కుజ గురు శుక్రులు సములనడము చూడగ పాండిత్య బలమేగాని శాస్త్రబలముగాదని తెలియును. కటకమునకు భాగ్యరాజ్యా ధిపతుల సములనడము ద్వాదశ, ద్వితీయ తృతీయాధిపతుల మిత్రు లనడము, శత్రువులే లేరనడము చోద్యము. దీనిని విమర్శించి చూచిన శాస్త్రముకాదని సంపూర్ణముగ తెలియుచున్నది,

## -: విద్య :-

శ్రీ:- స్వామీ పిల్లవానికి సంపూర్ణ జ్ఞానమున్నది, గ్రాహిత జ్ఞాపకశక్తులు, ప్రబలముగా నున్నవి. చదివించమని చెప్పితిరే యే గ్రహమునుబట్టి చెప్పితిరి. గ్రాహిత జ్ఞాపకశక్తులిచ్చు గ్రహమేదందురు

గు:- వత్సా గ్రాహిత జ్ఞాపకశక్తులిచ్చు గ్రహము చంద్రుడు మాతృ విద్యాధిపతి శుక్రుడు ఈ చంద్రుడు మీన మేష కటక వృశ్చిక గురులగ్నములకు శనిలగ్నములందు తులాలగ్నమునకు శుభుడు- చంద్రుడు చంద్రస్థానము శుభస్కారమైవున్నది. పంచమ స్థానము విద్యా నిలయము. పంచమాధిపతి విద్య నొసంగు గ్రహము- గ్రాహిత జ్ఞాపక శక్తులొసంగు గ్రహము. పంచమాధిపతి పంచమమందే వున్నాడు. తన మరొకయిల్లు శుభస్కారముగానే వున్నది. చంద్రుడు కటకము శుద్ధముగా వున్నది, చంద్రుడు గాన ఈ లక్షణములు గలిగినవారు సంపూర్ణముగ విద్యను గ్రహింతురు. పేరు ప్రఖ్యాతులు ప్రాక్పశ్చిమము లాక్రమించును. బిరుదుల గ్రహింతురు. దిట్టమై ఏదొవకవస్తువును కనిపెట్టి ప్రజల కొసంగుదురు. శతావధాన, అష్టావధానులై మహామహోపధ్యాయులై ఏకసంతగ్రాహియనిపించుకొందురు. పంచమాధిపతి పంచమ మందుండి చంద్రుడు శుభుడై యున్న మేరతప్పిన జ్ఞానముండును.

శ్రీ:- స్వామి పంచమాధిపతియు పంచమాధిపతి రెండు గృహములన్నారు. నాకు అర్థము గాలేదు.

గు:- నాయనా మకరలగ్నమునకు పంచమ దశమములు శుక్రునివి శుక్రుడు పంచమమందుండి దశమస్థానమగు తులలో బుధ శని రాహుగ్రహములలో నొకగ్రహముండిన శుక్రుడు శుక్రక్షేత్రములగు వృషభతులలు శుభస్థితి నొందినవిగద. అట్టివారికి ఆ గ్రహబలము సంపూర్ణముగా నున్నట్లేయగును,

శ్రీ:- స్వామి కొందరు గురుపాలిత జాతకులుందురే వారు కవులుగా నున్నారు. వారికి శుక్రుడు పాపిగదా. వారెట్లయిరందురు.

గు:- వత్సా మేషలగ్నమునకు లగ్నాధిపతియైన కుజుడు తులలో నుండిన- తుల శుక్రునిల్లు ఎనిమిదింటచూపుతో వృషభమును చూచును. శుక్రునిండ్లు రెండిని కుజుడు ఆక్రమించెను. నాలుగింటచూపుతో మకరమందున్న శుక్రుని చూచెను, అప్పటికి గ్రహము గ్రహ స్థానములు కుజునిచే కట్టుబడి తనది గురుపాలితలగ్నమైనను శుక్రలక్షణములు గలిగి ప్రకాశించును. ఇట్లు గ్రహము గ్రహ స్థానములు శుభస్థితి జెందిన వారరుదు-- వీరు పూర్వ జన్మమున యేదేవుస్లనో గొలిచివుందురు. గాన అట్టి గ్రహములు ఖగోళముననుండగా జన్మింతురు పాపగ్రిహమునకు ఇట్లుండిన అకారకత్వములతో అనేకమైన బాధలు గలుగును. శుభగ్రిహమైన వారే శోభాయమానముగా ప్రజలందు రాణించుచున్నారు.

శ్రీ:- స్వామి ఒక్కొక్కయిల్లు శుభస్తితి చెందినవారుకూడ రాణించుచున్నారుగద.

గు:- రాణించుదురు గాని వారిలో సంపూర్ణపాండిత్యముండదు ప్రజలకు, ఉపయుక్తమగు గ్రంధరచన సాగదు. బాగున్నదను ఖ్యాతి గడింపజాలరు- ఏ విద్యకైనను గ్రహము గ్రహస్థానములు ముఖ్యము.

శ్రీ:- కొందరి కిట్లుండి రాణింపరే వారినేమందురు.

గు - దశమము కీర్తి గౌరవప్రతిష్ఠలకు నెలవు గాబట్టి అక్కడ పాపగ్రిహమున్నను, చూచినను గౌరవప్రితిష్టలు దక్కవు. తానుచేసిన కార్యములు రాణించవు. విద్యయున్నను, ధనమున్నను, నేనింతవాడ నయ్యు కీర్తి ప్రతిష్ఠలు లేకపోయెనేయని చింతింతురు. చతుర్ధదశమము లలో నొకశుభగ్రహమున్న విద్యధనము కొలదిగానున్నను కీర్తి గౌర

వములు దండిగా నుండును. ప్రజలందు రాణింతురు. అట్లున్నవారు ముందుజన్మమున వరులకు మేలుచేసిన వారుగా నుందురు.

శ్రీ;- స్వామి పంచమమున యే శుభగ్రహములేక లగ్నపంచమ భాగ్యాధిపతులు ఎక్కడనో వుండగా చదివి ప్యాసగుచున్నారు. వీరినేమందురు.

గు;- పంచమమున యే గ్రహము లేకున్నను పంచమమున పాపగ్రహమున్నను పంచమాధిపతి పాపులచే కట్టుబడినను చదువు వచ్చుటకు భాగ్యలగ్నాధిపతులు శుభులై వుండుటో పంచమాధిపతి యొక్క రెండవగృహమున శుభులుండుటో ఏదైనా పాపగ్రహమునకు వెనుక నుండుటో నుండును. కొంతవరకు చదువుదురు. సంపూర్ణ విద్య వచ్చుటకు వీలుండదు. అనుకున్నంత ముందుకు పోజాలడు. పంచమాధిపతి యే గృహమున నుండునో, ఏ గృహము చూచునో ఆవిద్య సులభముగావచ్చును. ఆకారకృత్యములపై ప్రీతి కలుగును. లగ్నాధిపతి ఎచ్చట నుండునో ఆ గ్రహ మెట్టిదే ఆ గ్రహ కారకత్వములపై ప్రీతి గలుగును, ఆ సుఖమే గలుగును అనగా తొమ్మిదింట నుండెనేని జీవితాంతము ధనికుడుగా నుండును. ఆ ధనము ఆ గ్రహకారకత్వములతోగాని వున్న గ్రహ కారకత్వములతోగాని ఆర్జనైనదిగా నుండును. విద్యాస్థానాధిపతి ఎచ్చటుండునో ఆగృహమెవరిదో ఆకారకత్వములతోగాని ఉన్న గ్రహకారకత్వములతోగాని విద్య లభించును. చూచెడియింటి కారకత్వములుగూడ కొంతవరకు లభించును. బలవంతుడై యున్న ప్రబలముగా నుండును. దుర్బలముగా నుండిన కొంతవరకే లభించును.

శ్రీ;- స్వామి బలాబలముల తెలుసుకొనుటెట్లు తెలుపుడు.

గు;- వత్సా మేషరాశి అనుమానుము. మేష ప్రమాణము 4-23 విగడియలుగదా. అందులో సగము 2-11½ అవును. దీనిని ఆరోహణయందురు 2-11½ నుండి 4-23 వరకు అవరోహణయందురు. ఆరోహణలో గ్రహమున్న బలము, అవరోహణలోవున్న దుర్బలమందురు. దీనిలో భావము వేరు. భావమనగా ఒక్కరాశిలో 12 భాగలు చేసిన తనుభావము ధనము సోదర మాతృ విద్య శత్రు కళత్ర ఆయు భాగ్య జీవన లాభ వ్యయముల నునవి. ప్రతిలగ్నమునకు గలవు. ఆ గృహము లగ్నము నుండి ఎన్నవదో అనగా లగ్న చతుర్థమునకుగల కారకత్వములు ఆ లగ్నచతుర్థమునకే వుండును. చతుర్థమునకు లోపలనే గ్రహమున్న చతుర్థభావము చక్కగా నుండును. పంచమములో పంచమభావమునకు లోపలనే గ్రహమున్న బలము, షట్స్థానములో షట్స్థానమునకు లోపలనే శుభగ్రహమున్న శత్రురోగ ఋణవిపత్తులుండవు. పాపగ్రహమున్న శత్రురోగ ఋణవిపత్తులతో జీవితాంతము మానవుడు దుఃఖించును- సప్తమ స్థానములో సప్తమ భావమునకు లోపల గ్రహమున్న కళత్రాన్యోన్యత బాగుండును- అష్టమస్థానమున అష్టమ భావమునకు లోపల గ్రహమున్న ఆయుర్దాయము సంపూర్ణముగా నుండును—నవమస్థానమున నవమమునకు లోపల గ్రహమున్న భాగ్యము నిల్వ దండిగా నుండును. పిత్రార్జితము కావలసినంతవుండును. దశమస్థానమున దశమమునకు లోపల గ్రహమున్న వృత్తి ఉద్యోగ వ్యాపార గౌరవప్రతిష్ఠలు చక్కగా నుండును. ఏకాదశస్థానమున ఏకాదశమమునకు లోపల గ్రహమున్న ప్రవృత్తితో లాభముండును— జ్ఞానాభివృద్ధి వుండును. ద్వాదశస్థానమున ద్వాదశభావమునకు లోపల గ్రహమున్న ధనము దుర్వ్యయము గానియ్యక సద్వ్యయము చేయుంచును. దైవభక్తి నొసంగును. గ్రహబలమనిన యిట్లుండవలయును. పంచమమున పంచమభావమునకు లోపల గ్రహమున్న విద్యలో దక్ష

డగును ప్రతివిషయములోన బుద్ధి గమ్యస్థానము చేరుచుండును. ఇష్టే పాపగ్రహములున్నచో ఆ పావము శూన్యమగునని తెలుసుకొనుము—గ్రహబలమును ఇట్లు గమనించవలయును-

శ్రీ:- ఈవిద్యయందుత్తీర్ణుడై వృత్తి విద్యలో ఒకరు డాక్టరుగా, ఒకరు ఇంజనీరుగా ఇంజనీర్లలో అనేకమయిన భాగలున్నవిగదా. ఒకరు పౌరాణికుడుగా, మరొకడు కవిగా, యింకొకడు ఉద్యోగిగా, ఇంకొకడు వ్యాపారిగా మరొకడు భూజీవనుడుగా అనేకవిధముల తయారగుచున్నారుగదా. దీనిని గమనించుటెట్లో శలవిండు. మరొకటి అయిదింట నొకశుభగ్రహమున్నంతనే విద్యాబలమున్నదంటున్నారు. దీనినే మనవలెను.

## - వైద్యుడు - డాక్టరు -

గు:- నాయనా వైద్యుడు గావలయునన్నచో ఆరింట నొక శుభగ్రహము, ఎనిమిదింట నొకశుభగ్రహ ముండవలయును. ఆరు రోగస్థానము శత్రురోగ ఋణవిపత్తులు గలిగించునది. ఎనిమిది ఆయువుపట్టు. వైద్యుడు రోగనివారణ చేసియేగద సంపాదింపవలసినది—వారి జాతకరీత్యా ఆరింట భాగ్యస్థానాధిపతి వుండిన రోగులవల్ల, వడ్డీ వ్యాపారమువల్ల సంపాదింపవలయునుగదా. దీనికితోడు అష్టమమున నొకశుభగ్రహమున్న ఆయువున్నరోగియే వైద్యునికి తోడగును. దీనికి తోడు కీర్తిస్థానమగు దశమమున నొకశుభగ్రహమున్న తాను చేపట్టిన రోగులెల్లరు బాగుపడుదురు. దానితో కీర్తిగౌరవములు వ్యాపించి మరింత ఆదాయము గలిగి నిర్మాణము లనేకముచేసి సుఖముగా జీవించును. వైద్యమునకు బుధుడు కారకుడు. బుదుడు బుధగృహములగు మిధున కన్యలు శుభస్కరమైయుండిన విలువగల వైద్యుడగును. లక్షలాదిగా సంపాదించును. క్రొత్త ఔషదముల కనిపెట్టును. ప్రజలకెంతో ఉపకరించును. వినయ విధేయతలు భూతదయగలవాడుగా నుండును.

కం॥ నమ్మినసొమ్మగునానుడి
నమ్మకపోయిననుపోవు నానాభ్రష్టై
సమ్మతితో పరికించుము
సొమ్మగునానుడులు ప్రజకు శుభమౌ వత్సా.

కం॥ నానుడికాదని పలికిన
గానరు వేరొక్కత్రోవ ఘనులెవ్వరిలన్
మానవులకు సంజనమై
గానబడున్ శాస్త్రమహిమ కనుగొనువత్సా.

కం॥ దైవజ్ఞ మహాశయులున్
భావవిభేదమున గనక పరికించినచో
నావచనంబులమెత్తురు
దీవనలిచ్చెదరుకృతికి స్థిరముగ వత్సా.

కం॥ ఉండును ఆచంద్రార్కము
పండితపుంగవులు పొగడు భాతిన్స్థిరమై
పండెను నేటికిపుణ్యము
ఖండిత సద్యశము కృతికి గలుగున్ వత్సా.

కం॥ చింతావంతాదీర్పను
సంతాపంబార్పి హృదయశాంతి యొనర్పన్
యెంతో మేలగు జోస్యము
కొంతైనన్ లేక జగతి కూర్కదె వత్సా.

కం॥ కల్లసుమీ జోస్యంబని
యెల్లరు వచియించ వ్రాసిరెందరొ యిపుడా
కల్లవెనిజమన ముప్వురి
తల్లులకృపతో వచింతు తథ్యము వత్సా.

కం॥ వెలయిడిన ఫలముగలదన
కలవెల్లను కలుగునట్టి గ్రంథంబవగా
పొలియొక్కటి పోసీయక
తెలిపెద జోస్యంబు తేటతెలుగున వత్సా.

వత్సా జలార్గళశాస్త్రమని వ్రాసియున్నారు. అందులో చెట్లకు, పుట్టలకు ప్రాధాన్యత యిచ్చినారు. వేదాంగ జోస్యము నుండి చంద్రునకు లగ్నకోణాధిపతులకు కటకమునకు బలమిచ్చి వ్రాయబోతున్నాను. ఇది బావులు త్రవ్వకొనువారికి చాలా వుపయోగముగా నుండును.

గ్రామవాస్తును, దేవాలయవాస్తును వివరముగా వ్రాయనుద్దేసించితిని. త్వరలో వెలువడును. సప్రమాణ జ్యోతిస్సారములో పంచమ తరంగముగా నుండును.

— శుభం భూయాత్ —



## - శ్రీ వీరబ్రహ్మముగారి (జీవిత చరిత్ర) నాటకము -

నవీన పద్ధతిగా నాటక రంగస్థలమునకు సరిపోవునట్లు అనేక విషయములతో అనేక సందేహముల తీర్చునదిగా జీవసమాధియైనవారి మహత్త్వ విట్లుండునని తెలుపునదిగా మానవులకు మంచి మార్గదర్శక మిచ్చునదిగా సర్వవిషయముల కరతలామలకముగ తెలుపునదిగా వ్రాయబడినది. చదివి సర్వులు ఆనందింపతగినది. వెల రు. 5-00

## సప్రమాణ జ్యోతిస్సారము

ప్రకృతమున్న జ్యోతిషవాస్తు గ్రంథములు కృత్రిమములని నిరూపించి మార్గదర్శకమిచ్చు సద్గ్రంథము జ్యోతిశ్శాస్త్రాభిలాషిగల వారందరు చూడతగినది. ఇదివరకెన్నడు చూడనిది.

వెల రు. 15-00

## గృహవాస్తు

ప్రకృతమున్న వాస్తుగ్రంథములు కృత్రిమములు, అపోహము లని నిరూపించి మానవులకు మార్గదర్శక మిచ్చునది. జ్యోతిశ్శాస్త్రము నుండి వెలువడినది. క్రమబద్ధముగ నుండునది చూడతగినది.

వెల రు. 7-50

## - మాతృ జ్యోతి -

(నవలారాజము)

ఇయ్యది అమూల్య గ్రంథము 630 పేజీలు బైండు చేయబడినది. సంప్రదాయ విజ్ఞానజ్యోతి యనియు నవలారూపము ధరించిన విజ్ఞాన సర్వస్వమనియు, బహుశాస్త్రసారమనియు ఇట్టి గ్రంథము 'నభూతో న భవిష్యతి' యనియు పంచమ్మవేద పురాణముగా పరిగణింపవచ్చు ననియు పలువిధముల కవి పండితులచే పొగడంబడినది. వధూ వరులకు వజ్ర కవచము, యువతీ యువకులకు కామధేనువు, గృహిణీ గృహస్థులకు, ఉపాధ్యాయ బాలబాలికలకు సంగ్రహ. నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానులకు చింతామణియని పాఠకులచే అనేక విధముల మెప్పొందినది. ప్రతి యింట నుండ తగినది. వివాహ కాలములందు వధూవరులకు ఆశీర్వాదముతో యివ్వ తగినది.

వెల: రు. 15-00

## - జ్ఞాన జ్యోతి -

విద్యార్థులకు కల్పవృక్షము వంటిది. నీతి నియమములకు పెన్నిధి వంటిది. 100 పేజీల గ్రంథరాజము. వెల. రు. 2-00

## - గణేశ నారద సల్లాపము -

ఇయ్యది సన్యాసి జన్మ వచ్చుటకు కారణముల తెల్పును. నీతి నియమములు ఎన్నిటనో విరజల్లును. సరళమై మృదుమధురమై చదువరులకింపుసొంపు నొసగు పద్యకావ్యము. వెల: రు. 2-00

## - శ్రీ శారదా గణేశ, వరప్రసాద వధూ వరులు -

ఇది ఒక ఏకాంక నాటిక - ఇందులో వధూవరులు మేనమామ మేనకోడలు - దుర్వ్యసనాలోలుడై, సర్వత్రా చెడిన మామను సక్రమ పరచి వివాహమాడిన మేనకోడలి నీతి వాక్యములు ధర్మము లనేకము గలది. ఉన్నత విద్య నభ్యసించు విద్యార్థులు ముఖ్యముగా చదువ తగినది. వెల: రు. 3-00

---

చిరునామా:-

శ్రీ రాఘవేంద్ర జ్యోతిషాలయము,

తాడిపత్రి తాలూకా.) బొందలదిన్నె. (అనంతపురం జిల్లా.